THE

# TALES

OF

# VIKRAMARKA,

BY RAVEPATE GOOROOMOORTE,

DEPUTY TELOOGOO MASTER

IN THE

***COLLEGE OF FORT ST. GEORGE.***



---

THIRD EDITION.

---

**Madras:**

PRINTED AT THE HINDU PRESS.

1850.

TO

**A. D. CAMPBELL, Esq.**

MEMBER OF THE BOARD OF SUPERINTENDENCE,

AND

SECRETARY

TO THE

COLLEGE OF FORT St. GEORGE ;

**THIS WORK**

IS MOST RESPECTFULLY DEDICATED,

BY HIS MOST OBEDIENT HUMBLE SERVANT,

*THE AUTHOR.*

# ADVERTISEMENT.

The following Tales have been compiled as a class book, for the use of the Students of the College of Fort St. George, principally from various manuscript works, partly from traditionary legends.

The author, in the first eighty pages of the work, has endeavoured to make use of the most simple and common terms, without adhering more to the permutation of letters than is usual in speaking the language. In the subsequent pages of the book, he has strictly observed the rules for literary composition; the permutation of letters is consequently more frequent; and more difficult terms are employed.

చెన్నపట్టణపాఠశాల యుంచినది మొదలుకొని పాఠశాలలో విద్యా
భ్యాసముఁ జేసెడు దొరలు తెలుఁగు భాషఁ జదువుటకు నుపయుక్తమైన
కథలు లేకవారు పడియెడు శ్రమయావత్తునుం జూచి వారిశ్రమనివారిం
పఁదలఁచి - చెన్నపట్టణపాఠశాలలో సెక్రటేరియు మెంబరును నై పూ
ర్వము తెలుఁగు వ్యాకరణము నింగిలీషు చేసిన మహా రాజరాజశ్రీ
యే - డి - కేమిల్ దొరగారు దొరలకుఁ జదువనుపయుక్తమైన కథలు చే
యుమని యాజ్ఞాపించిరి గనక వారియుత్తరువుమీద - ఇప్పుడు తెలుఁగు
భాషనభ్యసించెడు దొరలకు లోకవ్యవహారానుసారముగానా భాషత్వ
రగాఁ జదువనేర్చుకొనుటకును మాట్లాడనేర్చుకొనుటకును సాధకం
బును సులభంబును గొన్ని యెడల వ్యాకరణలక్షణానుసారముగా సంధియు
క్తంబును నై చదువు వారలకును విను వారలకును వెండియుం జదువవలయు
వినవలయు నని మొదున పేక్షఁబుట్టించునట్టి ద్వాత్రింశత్సాలభంజిక
యను పేరుగల కథల పుస్తకము - ఉత్తరదేశస్థుఁడై చెన్నపట్టణపాఠశాల
లోఁ దెలుఁగు భాషకు రెండవ యుపాధ్యాయుండైన యార్వ లని యోగి
యగు రావిపాటి గురుమూర్తిచేతఁ దెలుఁగు భాషయందు వచనరూపము
గాఁ జేయఁబడి మూడవ తేప ౧౮౫౦ యో సంవత్సరానికి సరియైన సాధార
ణనామసంవత్సరములో - చెన్నపట్టణమునం దచ్చు వేయించబడ్డది.



శ్రీ శారదాంబాయై నమః.

## ద్వాత్రింశత్సాలభంజికల కథలు.

కైలాసపర్వతమునందు పార్వతీపరమేశ్వరులు సంచరించుచుండే సమయమునను అక్కడికి ఋషిశ్రేష్ఠుండగు నారదుండు వచ్చి వారికి వందనము చేసి - వారిచేత సెలవు తీసుకొని - నందికేశ్వరునిదగ్గిరికివచ్చి-అతనిచేత పూజింపఁబడ్డవాఁడై అతఁడుయిప్పించిన పీఠము మీఁద కూచుండివుండగా నందికేశ్వరుండు నారదుని చూచి - మీరెప్పుడున్ను మూఁడు లోకముల యందున్ను సంచరించేవారు - మీరుచూచిన విశేషంబులేమైనావుండెనా ఆనతీయవలయు నని పలికెను - మీరు భూత భవిష్యద్వర్తమానములను గుర్తెరిగిన వారుమీరెరుంగని విశేషంబు యేలోకంబున్నైనా కద్దా నేనెంత వాఁడను అయినా మీరు నన్ను ఆదరించి అడుగుచున్నారు కాబట్టి విక్రమార్కుఁడు యొక్క సింహాసన మందుండే ప్రతిమలు చెప్పిన కథలు కలవు అవి విన్నవించెదను వినండి అని నారదుండు చెప్పసాగెను- యెట్లాగంటే.

వేద నారాయణ పురమనే అగ్రహారము కద్దు - అందు విష్ణుశర్ముఁడు అనే బ్రాహ్మణుడు కలఁడు అతనికి యజ్ఞనారాయణుడు -వేదనారాయణుడు- పీరనారాయణుడు - చంద్రశర్మ - అనినలుగురు కొమాళ్లు కలరు. అందులో కడపటి వాఁడు వినా గాకడమ ముగ్గురున్ను వేదముల యందున్ను శాస్త్రముల యందున్ను వ్యవహారములయందున్ను ఆలోచనల యందున్ను నిండాప్రజ్ఞ కలవారు - కాబట్టి తమతమ పాండిత్యమువల్ల సభల యం

దుబహుమానములను పొందుచూ వుండిరి - కడపటి వాడు విద్య కొంచెమైనా నేరడు గనక ఆముగ్గురు చెప్పే పనులన్నీ చేస్తూవుండెను - యీప్ర
కారముగా కడపటివాడైన చంద్రశర్మ కొంత కాలము శ్రమపడుతూ వుం
డి - తన అన్నలు అన్ని పనులున్ను తనకు చెప్పడము చేత వొక నాడు చింతా
క్రాంతుడై - తనకు చదువు రానందున గదా - అన్నలు తన్ను కొంచెము
గా చూచి పనులు చెప్పుచున్నారు అని విసికి - దేశాంతరమందు చదువుకో
వలెనని యిచ్ఛ యుంచి - తల్లిదండ్రులతో గానీ అన్నలతో గానీ చెప్పక -
నిశీథ వేళ యిల్లు బైలు వెళ్లెను - తర్వాత సాయంకాలానికి కొంత దూర
ము పోయి - వొక అగ్రహారానికి సమీపాన నదీతీరమందు చంక మూటదిం
చి - సాయంకాలమందు చేయవలసిన కార్యములు తీర్చుకొనే నిమిత్తము
అతడు నదిలో దిగి - పరిశుద్ధ జలముల సంధ్య వార్చి - గట్టున వచ్చి కూ
ర్చుండి - జపము చేసుకొంటూ వొంటిగా వుండెను - అప్పుడు ఆ యేటి గట్టు
న ఆకాశమును తాకుతూ వుండే కొమ్మలు గల వొక రావి చెట్టు మీద బ
హుదినములనుంచి వాసము చేస్తూ వుండే బ్రహ్మరక్షస్సు చెట్టు దిగి వచ్చి
బ్రాహ్మణాకారముతో చంద్రశర్మ ముందర నిలిచి - నీవు యెవ్వరు అని అడిగె
ను - అతడు ఆ బ్రాహ్మణాకారముతో వచ్చిన బ్రహ్మరక్షస్సును చూచి - యీ
అగ్రహారములో వుండే బ్రాహ్మణుడు కాబోలు ననుకొని అయ్యా నేను
విద్యను అపేక్షించి - యెవ్వరైనా విద్య చెప్పితే - నేర్చుకొందామని వ
చ్చినాను అని తన కుల గోత్ర నామములు తెలిపెను - చదువు కొంటావా
అని బ్రహ్మరక్షస్సు అతణ్ని అడిగెను - ఆ బ్రాహ్మణుడు బ్రహ్మరక్షస్సని
యెరుగక - యీ అగ్రహారములో వుండే విద్వాంసుడు అని యెంచి - తాను
కోరిన కోర్కె యీడేరెను గదా - అని చాలా సంతోషించి - చదువుకోవ

డానకు ఒప్పుకొనెను - అయితే నన్ను చూచి నీవు జడుసుకోక దిటముగానుండుమని - బ్రహ్మరక్షస్సు తన ఆకారము చూపెను - గనక బ్రాహ్మణుడు చూచి దిగులు పడి కన్నులు మూసుకొనెను - తత్క్షణమే బ్రహ్మరక్షస్సు మునుపటివలె బ్రాహ్మణాకృతితో నిలిచి - జడపు తీర్చి - చంద్రశర్మను ఆ అశ్వత్థము మీదికి తిసుకపోయి - ఆరునెలలు నిద్రాహారములు లేకుండా చదువు చెప్పి - తర్వాత తను వూ చంద్రశర్మా నాకు శాపవిమోచనమాయెను - నీకున్ను విద్య వచ్చేను - యికమీద నీవు మీ వూరికి పోవచ్చును. నేను గంగాయాత్ర పోతాను - నీవు ముందు శ్రేయస్సును పొంది - సకల సామ్రాజ్య యోగము గలిగివుందువు - నీకు బహు సమర్థులైన నలుగురు కొమాళ్లు గలుగుదురు - అని దీవించి పొమ్మనెను - అప్పుడు చంద్రశర్మ బ్రహ్మరక్షస్సును చూచి - సకల వేదశాస్త్రములు తెలిసిన మీకు యెందునిమిత్తము యీ బ్రహ్మరక్షస్త్వము వచ్చెను - యిప్పుడు మీరు గంగాయాత్రకు యెందుకు పోతారు - నాకు మీరు గురువులు గదా - శిష్యునిమీదను దయవుంచి ఆనతీయవలెను. అని అడగగా బ్రహ్మరక్షస్సు యిట్లనియె - మునుపు నేను కృష్ణా తీరమందు సరస్వతీపురమనే అగ్రహారమందు వుండి - సకల విద్యలు చదువుకొంటిని - అప్పుడు వక బ్రాహ్మణుడు విద్యార్థియై వచ్చి - నాకు నమస్కరించి - నేను కొంత విద్య నేర్చివున్నాను - మరిన్ని విద్య చదువుకోవలెనని వచ్చినాను - నామీద దయ చేసి - నాకు విద్యాదానము చెయ్యవలెనని ఆశ్రయించెను - నాకు వచ్చిన విద్య వకరికి చెప్పనా అని గర్వముచేత ఆతనికి విద్య చెప్పక పోతిని - అందుచేత ఆ బ్రాహ్మణుడు మహా కోపము తెచ్చుకొని - నన్ను అనాదరణ చేస్తివి గదా నీ విద్య నీ వద్ద నే వుంచుకో నేను మరియొక్కడనయి నా నేర్చుకొంటాను - నీవు బ్రహ్మరక్షస్సువు గమ్మని శపించెను - ఆ తరువాత నేను భయపడి శాపవిమోచనమయ్యేటట్టుగా అనుగ్రహించుమని అడుగగా - కొంత కా

లానకు చంద్రశర్మ అనే బ్రాహ్మణుడు విద్యార్థియై దేశాంతరము వచ్చెను - అకస్మాత్తుగా వొక నదీ తీరమందు ఆయన నీవున్న సంధింతురు - ఆవిద్యార్థి నీవల్ల సకల విద్యలున్ను అభ్యసించును - ఆతర్వాత తను గంగాస్నానము చేసుకొంటే అప్పుడు నీకు శాపవిమోచనమయి బ్రహ్మరక్షస్త్వము విడిచి - బ్రాహ్మణత్వము పొందుదువు అని ఆ బ్రాహ్మణుడు చెప్పెగనక నేను బ్రహ్మరక్షస్సునయి యీ వృక్షము మీదనుండి - నీ రాకకెదురు చూస్తూవుంటిని - నీకు విద్య చెప్పితిని గదా యింక నేను గంగాస్నానానికి పోతున్నాను - శాపవిమోచనము చేసుకొంటాను అని చంద్రశర్మను చేపట్టి దించి - బ్రహ్మరక్షస్సు గంగాస్నానము పోయెను - అంతట చంద్రశర్మ తాను మునుపు వచ్చిన దోవజ్ఞాపకం లేక - వొక మార్గాన పోయి - ఉజ్జయినీ నగరపు వీధిలో చొచ్చి పోతూవుండగా - ఆరు నెలలు నిద్రాహారములు లేక వుండెను గనక - ఆబడలిక చేత ఆ వీధిలో వక వేశ్య యిల్లు చూచి - బ్రాహ్మణుల యిల్లని యెంచి నడవలోకి పోయి - అంగవస్త్రం కింద వేసుకొని - పండుకొని - నిద్రపోయెను - యింతలో వేశ్యకొమార్తె బహుచక్కనిది సౌందర్యవతి అనే పేరుగల చిన్నది తలవాకిటికి వచ్చి - ఆ నిద్రపోయ్యే వాణ్ని చూచి - వీడే తనకు పురుషుడని మనస్సులో యెంచుకొని యింట్లోకి పోయి - యిప్పుడు తనకు తగిన పురుషుడు నడవలో వచ్చి వున్నాడు అని మహా సంతోషముగా చెప్పెను - అంతట దాని తల్లి ఆ వచ్చినవాడు యెంత సంపద గలవాడో చూతాము వాని సొమ్ము అంతా మనము రాదీయవచ్చును - అని నడవలోకి వచ్చి - నిద్ర పొయ్యే వాణ్ని చూచి - యీ బీద బ్రాహ్మణ్ని యేమని కోరితివి - అని కూతురి మీద కోపించుకొనెను - అప్పుడు దాని కూతురు తల్లి మాటలు చెవిని పెట్టక - వాడే కావలెనని నిష్టూరముగా పలికెను - కూతురి మనస్సు తిప్ప లేక తల్లిన్ని సమ్మతించెను - పిమ్మట అతడు

ఆసాయంకాలానికినిద్ర లేవక పోయెను - ఉదయానికినిద్ర లేవక పోయె
ను - కాలుచెయ్యి కదిలించకుండావుండెను - యిట్లా వుండగా దానితల్లి
యిదియేమోఅనిఆపట్టణముయేలేద్విజకీర్తిఅనేరాజుదగ్గిరికిపోయితనకొ
మారితె చెప్పినమాటలున్ను ఆబ్రాహ్మణుడునిద్ర పోవడమున్ను చెప్ప
గనక రాజువిని బ్రాహ్మణుడుఆహారములేక వకదినమంతానిద్ర పోవడ
మేమో చూచిరమ్మనితననగరివైద్యులనంపగా వారువచ్చి నిద్రపోయ్యే
చంద్రశర్మధాతువు చూచి రాజుదగ్గిరికితిరుగా పోయిఆరునెలలు యేమిని
మిత్తమోనిద్రాహారాలు లేకవున్నాడు యిందుకు యేమి చేయవలెనం
టే అన్నముయెత్తగాపిశికివెత్తగిలి వున్న శరీరమందు పట్టిస్తూ రావలె
ను - కొన్నిదినాలకుపోలితే రెండోపక్క అదేప్రకారముగా పట్టిస్తూ
వస్తే నిద్రపూర్తిగాఅయినతర్వాత లేచునని వైద్యులుచెప్పిరి - తర్వా
త ఆప్రకారమే బ్రాహ్మణులనువుంచి కాపాడుతూవచ్చిరి - ఆరునెలలుఅ
యినతర్వాతరాత్రినిద్రపోయి ఉదయానలేచినవానివలెనే లేచి యెక్క
డనిద్రపోతిమి యీయిల్లుయెవ్వరిది యీపడుచుయెవ్వరు అనితలపోసియె
వ్వరుఅయితేనేమిమనదోవనుమనము పోదామని లేవబోగా - ఆపడుచు
కొంగుబట్టినన్ను విడిచిపోతావా నీనిమిత్తము ఆరునెలలు కాచివుంటిని నీవు
నాపురుషుడవు నేనునీభార్యను అనిచెప్పగా నేను బ్రాహ్మణ్ణి నీవు శూ
ద్రదానవు యీమాటలుకూడవు నీకునాకుసంబంధమేమి అని బ్రాహ్మణు
డు లేచెను ఆవేశ్యకొంగుపట్టుకొనివిడువకపోయెనుఅక్కడివారుయీసమా
చారము రాజుతో చెప్పిరి రాజువిని వారినిపిలిపించి పడుచును సమాధానపె
ట్టలేక చంద్రశర్మనున్ను సమాధానపెట్టలేక పెద్దలైన బ్రాహ్మణుల
ను పిలిపించి యీన్యాయముతీర్చుమని చెప్పితే వారుశాస్త్రము విచారిం
చి బ్రాహ్మణకుబ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులను నాలుగువర్ణము

లలో వివాహము చేసుకోవచ్చునని చంద్రశర్మను సమాధానపరిచిరి - అంతట రాజు ముందుగా - ఆ చంద్రశర్మకు తన పురోహితుని కొమార్తెను వివాహము చేయించి రెండో లగ్నాన తన కొమార్తెను వివాహము చేసెను - మూడో లగ్నమందు ఆ పట్టణపు పెద్ద శెట్టి కొమార్తెనున్ను నాలుగో లగ్నమందు ఆ వేశ్యా కన్యనున్ను వివాహము చేయించెను - ఆ రాజుకు కొమాళ్లు లేరుగనక - అల్లునికి అర్ధరాజ్యమిచ్చి యేనుగులు గుర్రాలు మొదలయిన చతురంగబలములలో సగమిచ్చి అల్లుణ్ని తన పట్నములో నే వుంచుకొని సుఖాన వుండెను - యీ చంద్రశర్మ(డున్ను నాలుగు యిండ్లు కట్టించి నలుగురు భార్యలను నాలుగు యిండ్లలో వుంచి బ్రాహ్మణస్త్రీ నివుంచిన యింట్లో స్నానసంధ్యాదులు చేసుకొంటూ ధర్మమార్గము తప్పక సుఖిస్తూ వుండెను - తర్వాత ఆ పట్నంయేలే ద్విజకీర్తి యనే రాజు కొంత కాలానకు మృతి బొందెను - అంతట మంత్రులు పురోహితుడు మొదలయిన సమస్తమైన వారున్ను కూడి రాజుకు కొమాళ్లు లేనందున ఆ రాజ్యపరిపాలనకు చంద్రశర్మను పట్టము గట్టిరి - ఆ బ్రాహ్మణస్త్రీ గర్భమందు వరరుచియనే కొమారుడు పుట్టెను రాజు కొమార్తెకు విక్రమార్కుడు పుట్టెను - వైశ్య నికొమార్తెకు భట్టియనే వాడు పుట్టెను - వేశ్యకు భర్తృహరియనే వాడు పుట్టెను - యీ ప్రకారము చంద్రశర్మకు నాలుగు జాతుల స్త్రీలయందు నలుగురు కొమాళ్లు పుట్టిరి - యీ నలుగురున్ను సమస్త విద్యలలో మహానిపుణులై వుండిరి యిట్లా వుండగా చంద్రశర్మ విక్రమార్కుని సాహస వితరణాది గుణములు చూచి యితడు ద్విజకీర్తికి దౌహిత్రుడు - యితడే రాజ్యానికి అర్హుడని విక్రమార్కునికి పట్టము గట్టి భట్టికి ప్రధానత్వము యిచ్చెను - తర్వాత కాళికా దేవిని గురించి విక్రమార్కు(డు మహా ఘోరమయిన తపస్సు చేసెను - అప్పుడు కాళికా దేవి విక్రమార్కునికి ప్రత్య

క్షమై నీతపస్సుకు మెచ్చి తిని నీవు వెయ్యేండ్లు రాజ్య పరిపాలన చేశేటట్టుగా నీకు వరమిచ్చి నాను నీకు యెవరిచేత నున్ను చావులేదు అయితే పదమూడు నెలల చిన్నదానికి పుట్టిన వాఁడు నిన్ను చంపును వాడు వినాగాకు రియెవరున్ను నిన్నేమిన్ని చెయ్యలేరు పొమ్మనెను. అంతట విక్రమార్కుఁడు యింటికి వచ్చి భట్టిని చూచి యీ వృత్తాంతమంతా చెప్పగా విని చాలా సంతోషించి కాళికాదేవి నీకు వెయ్యేండ్లు ఆయుస్సు గదా యిచ్చినది నేనొక వెయ్యేండ్లు ఆయుష్షు నీకు యిస్తాను చూడుమనెను - అది యెట్లాగని భట్టిని విక్రమార్కుఁడడిగెను - భట్టి చెప్పుచున్నాడు - ఓయి రాజా నీవు వెయ్యేండ్లు రాజ్యమేలేటట్టుగా గదా కాళికాదేవి వరమిచ్చినది - నీవు ఆరు నెలలు రాజ్యమేలేది - ఆరు నెలలు భూసంచారము చేసేది యిట్లాగనక వుంటే వెయ్యేండ్లు రాజ్యమేలేవరకు రెండువేలయేండ్లు అవుతున్నవి - అనగా విక్రమార్కుఁడు భట్టి ఉపాయానకు సంతోషించి భట్టి చెప్పిన ప్రకారముగా వింటున్ను - యిటువంటి రాజు లోకములో యెక్కడనైనా గలఁడా అని ప్రజలు తన్ను పొగిడేటట్టుగా మహాధర్మముగా రాజ్య పరిపాలన చేస్తూ వుండెను.

ఒకనాడు ఒక సన్న్యాసి విక్రమార్కుని దగ్గిరికి వచ్చి ఆశీర్వదించి ఒక పండు యిచ్చెను మరునాడున్ను అదే ప్రకారముగా పండు తెచ్చి యిచ్చెను యిట్లా అనేక దినములు దినదినమున్ను ఒక పండు వంతున తెచ్చి యిస్తూ వుండెను - ఆ పండ్లు విక్రమార్కుఁడు అప్పుడప్పుడు ఉగ్రాణపు వాడి దగ్గిర యిస్తూ వచ్చెను - ఒకనాడు యీ సన్న్యాసి పండు యివ్వగా నే దగ్గిర కోతి వుండగా దాని ముందర యీ పండు రాజు వేసెను - ఆ కోతి ఆ పండు తించామని కొరకగానే అందులోనుంచి అనేక రత్నాలు జలజల నేల రాలెను - అది చూచి రాజు ఆశ్చర్యపడి మునుపు తాను వుగ్రాణపు వానిదగ్గిర యిచ్చిన పండ్లన్ని తెప్పించి పగల్చి చూస్తే వాటిలో నున్ను అనేక రత్నాలు వుండె

ను - అప్పుడు రాజు బహుసంతోషించి ఆసన్న్యాసిని చూచి మీరు యేమి కో
వలసి నావద్దికి వచ్చి నాకు యిటువంటి పండ్లు తెచ్చి యిస్తున్నారని అడిగెను-
ఆసన్న్యాసి చెప్పుచున్నాడు- ఓ రాజా నేనొక తపస్సు చెయ్యవలెనని
యత్నము చేసినాను దానికి నిన్నుంచి ఒక పని కావలసివున్నది నేటికి పది
హేనో నాడు అర్థరాత్రి వేళ నీవు ఒంటిగా నేనున్న చోటికి వస్తే ఆపని
అప్పుడు చెప్పుతాను నీవు నాకు సహాయమైనట్టయితే నా తపస్సు నెరవేరును-
అనగా రాజు అంగీకరించి చోటు గుర్తు అడిగి తెలుసుకొని వస్తాను పొమ్మనె
ను - తర్వాత ఆపది హేనో నాడు అర్థరాత్రి వేళ రాజు ధట్టి మొలను బి
గించి కత్తి చేతపట్టుకొని ఒంటిగా అతనిదగ్గిరికి పోయి స్వామీ నేను వచ్చి
నాను యేమి ఆజ్ఞాపిస్తున్నారో ఆజ్ఞాపించండి అని వినయపూర్వ
కముగా ప్రదక్షిణనమస్కారములు చేసి యెదుట నిలుచున్న రాజుం
జూచి ఓ మహారాజా నీవు ఆడితప్పని వాడవు నాకు మాట యిచ్చిన ప్రకారము
వచ్చినావు - నేనొక తపస్సు చెయ్యవలెనని ప్రయత్నము చేస్తే బేతాళుడ
నేవాడు దానికి విఘ్నము చేస్తూవస్తున్నాడు - యెన్నటికిన్ని ఆప్రయత్న
ముకొనసాగనియ్యడు - నీవు మహాబలపరాక్రమశాలివి గనక యిప్పుడా బే
తాళుణ్ని పట్టుకొని కట్టి యిక్కడికి తీసుకవస్తే అవతల విఘ్నము చేసేవారు
లేరు నా కార్యము నెరవేరును - యీపని చేయతగ్గవారు నీవు వినాగా వే
రేవొవరున్ను లేరు వాణ్ని తెచ్చేటప్పుడు నీవు మాట్లాడితివా వాడు పారిపో
ను మాట్లాడకుండా తీసుకరమ్మని పంపగా నా విక్రమార్కుండు బేతాళు
డుండే చోటు గురుతు అడిగి తెలుసుకొని అక్కడికిపోయి బేతాళుణ్ని పట్టు
కొని కట్టి వీపున బెట్టుకొని వస్తూవుండగా బేతాళుడు విక్రమార్కుణ్ని జూచి
ఓ రాజా నేనొక ప్రశ్న చేస్తున్నాను దానికి నీవు తెలిసి ఉత్తరువు చెప్పక పో
తివా నీ తల సహస్ర వక్కలౌను చక్కగా కథ వినుమని విక్రమార్కుని కిట్లని
చెప్ప మొదలుబెట్టెను.

వినవోయిరాజా శోభావతి యను పురంబున యశః కేతుండను రాజుగలడు - అతండు దేవబ్రాహ్మణభక్తిగలవాడై హరకారాలను పంపించిఅన్ని దేశాల సమాచారములు తెప్పిస్తున్న తనవద్ద కొలిచే వాండ్లనుమహాప్రీతిగావిచారిస్తున్న జీతగాండ్లకు నెలనెలకు జీతాలుయిస్తున్న తానుచేశేఆలోచనతనరాజ్యముబైలువెళ్లి పోకుండా మితహిత జనులతోనాలోచనచేస్తున్నతనదేశములోవుండేవారికితానుయిచ్చినకౌలు తప్పకుండానడిపిస్తున్న సమస్తమయినవాడున్న యిటువంటిరాజు యేదేశంబులోనైనావున్నాడా అని స్తోత్రముచేశేటట్టుగా ధర్మమువిడువక రాజ్యముచేస్తూవుండెను - అప్పుడాపట్ణానికిబైటనొక కాళీకాదేవిగుడివుండును ఆకాళీకాదేవికిప్రతిసంవత్సరమున్ను జాతరచేస్తూవుందురు ఆపట్ణములోవుండేకొందరు స్త్రీలుఒకకోనేటికిపోయి అక్కడస్నానముచేస్తూవుండగా మరివకపట్ణములోవుండే ధవళుడుఅనేవకచాకలవాడుశోభావతీపురానికి వక పనికోసముపోతున్నా ఆమార్గానవచ్చిఅక్కడస్నానముచేస్తూవుండేస్త్రీలనుచూచి అందులోనొక స్త్రీమీదమనస్సు తగిలి అక్కడనొకచోటదాగివుండి అటువెనకను ఆ స్త్రీలువారి వారియిండ్లకుపొయ్యే టప్పుడు ఆస్త్రీయందుతగిలిన తనమనస్సు మళ్లీ తిప్పుకోలేక యీ స్త్రీ తనకు భార్య ఆయెనాకొన్ని దినములకు వెనక తనతల కాళీకాదేవికిబలియిస్తునని మొక్కుకొని ఆకాళీకాదేవిని మనస్సులోదలుచుకొనిదానివెంటనేపోయి అదిప్రవేశించిన యిల్లుగుర్తుచూచుకొని పిమ్మట తానువచ్చినపనివిచారించుకొనేటందుకుతోచక మళ్లీతన పట్ణానకుపోయి ఆవిరహభారం సహించలేక కృశిస్తూవుండగా ఆవర్తమానమంతాఅతనితల్లిదండ్రులుగుర్తెరిగి ఆస్త్రీవుండేచోటువాణ్ని అడిగితెలుసుకొని అక్కడికిపోయి ఆచిన్నదానితల్లిదండ్రులనుచూచి కులగోత్రములువిచారించిదైవవశమువల్లనుఇవిమ

నకు అనుకూలముగానున్న విగదా అని మనస్సులో సంతోషపడి మా కొడుక్కు మీ కూతురిని యియ్యవలెను అని పెండ్లికి తగిన మాటలు మాట్లాడి వారిని సమ్మతిపరచి తమ యింటికి పోయి యీ సమాచారం కొమారుడితో చెప్పగానే నిండా సంతోషపడెను - తర్వాత తను వక మంచి ముహూర్తం విచారించి ఆ ముహూర్తాన వారు పెండ్లి చేసిరి- అటు వెనక కొన్ని దినాలకు ఆ చిన్న దాని తల్లితండ్రులు దాన్ని అత్తవారింటికి అంపించి తర్వాత మరి కొన్ని దినాలకు మళ్లీ కూతురినిన్ని అల్లుణ్ణిన్ని తోడుక రమ్మని తమ కొడుకును పంపగా నతడు పోయి చెల్లెలిని చూచి దాని యత్తమామలకు యీ వర్తమానము చెప్పెను - వారున్ను సంతోషించి కొడుకును కోడలిని అలంకరించి అతని వెంట నంపించిరి - అప్పుడు వారు ముగ్గురున్ను వస్తూన్ను మార్గములో వున్న ఆకాళికాదేవి గుడి సమీపానకు వచ్చి అక్కడ ఆసోదా చేసుకొని వుండే సమయములో- ఆ చిన్నదాని పెనిమిటి అయిన ధవళుడు గుళ్లోకి పోయి అమ్మ వారిని చూచి తాను మొక్కుకొన్న మొక్కు చెల్లించవలెనని తలుచుకొని తన తల కోసుకొని అమ్మవారికి సమర్పించి తాను మృతి బొందెను. అంతట అతని బావమరిది కొంచెము సేపు - అతడు రాకపోయెనని యెదురు చూస్తూ వుండి నేను పోయి పిలుచుకవస్తానని చెల్లెలితో చెప్పి తాను ఆగుడికి పోయి అక్కడ తల తెగిపడి వున్న చెల్లెలి మొగుణ్ణి చూచి విచారపడి తానున్ను తల గోసుకొని చచ్చెను - అటు వెనక వారిద్దరున్ను రాకపోవుటకు విస్మయంబంది యా చిన్నది యా గుడికి పోయి అక్కడ చచ్చి పడియున్న వారి నిద్దరినిం జూచి చింతాక్రాంతురాలై యింక నేనున్ను ప్రాణాలు విడుస్తాను అని మెడకు వురి బోసుకుంటూ వుండగా ఆకాళికాదేవి దానికి ప్రసన్నురాలయి యిట్లనియె - ఓ మహా పతివ్రతా నీ పతిభక్తికి నేను మెచ్చితిని నీ వెందుకు యిటువంటి సాహసపు పని చేస్తావు యిప్పుడీ తల కాయలు రెండున్ను యెత్తి మొండేలతో తగిలిస్తే వచ్చి

న వారిద్దరున్ను మల్లీ బ్రతుకుతారు అని చెప్పగానే ఆ స్త్రీ త్వరగా వచ్చి పెనిమిటితల అన్న మొండేనికిన్ని అన్నతల పెనిమిటి మొండేనికిన్ని తగిలించెను - అంతలో వారిద్దరున్ను లేచికూర్చుండిరి - యీచిన్నది వారిద్దరిని చూచి తానుపరిశీలించక చేశినపనికి డోలాయమానమానసురాలై యేమీ తోచకనిశ్చేష్టితురాలై యుండెను - ఆ స్త్రీకి యెవడు పెనిమిటిగా వచ్చును చెప్పుమని బేతాళుం డడిగిన విక్రమార్కుండిట్లనియె - సమస్త దేహానికిన్ని శిరస్సు ప్రధానముగనక మొగుడెతల గలవని మొండెము తోనతికించెనో అతడే ఆ స్త్రీకి మొగుడుగా వచ్చును అని చెప్పిన బేతాళుం డదృశ్యుం డై చనియె.

తర్వాత విక్రమార్కుం డెప్పటియట్లమరల బేతాళుంబట్టుకొని వచ్చుచుండగా నా బేతాళుండు విక్రమార్కునితో నిట్లనియె - మల్లికాపురమను పట్టణములో శకటశృంగుడనే రాజు రాజ్యపరిపాలన చేస్తూవుండగా నా రాజు నొద్ద కాపాటకుండను వాడొకడు నిమిషమైనా యెడబాయకుండా వుండును - యిట్లావుండగా ఆరాజొక నాడు వేటాడవలెననే యిచ్ఛ చేత అనేక సేనతో కూడా అరణ్యమునకుపోయి అక్కడ నొక మంచిగుర్రాన్ని యెక్కి కాపాటకునితో కూడా బహుదూరంగా నిర్మానుష్యమైన చోటికిపోయి యెండ పెట్టు దగిలి దప్పి చేత డస్సివుండగా నా కాపాటకుండు రెండువుశిరికపండ్లు దెచ్చి యిచ్చిన నా రాజు భక్షించి దాహముదీరి తనపట్నానకుపోయెను - అటువెనక నొకనాడా రాజు కాపాటకుని జూచి ఓయి సింహళదేశపు రాజు కొమార్తెను నేను వివాహము చేసుకోవలెనని కోరుతున్నాను కావున నీవక్కడికి పోయి ఆపడుచును నాకు మాట్లాడి రమ్మని పంపించెను - తర్వాతను అతడొక వర్తకుని వాడమీదను యెక్కి సముద్రమునడమపోతూవుండగా అపుడు పెద్ద గాలి కొట్టి దైవవశమున ఆ వాడ బద్దలయ్యెను-

అందులోవున్న జనులందరున్ను చచ్చిరి - కాపాటకుడుమాత్రము వై
కకొయ్య పట్టుకొని యీదుకొనిపోతూవుండగానక్కడనొకతీగె అగుపడె
ను ఆతీగెవెంబడిగానీళ్లలోపోయి నాగలోకముచేరి అక్కడనొకదుర్గాగుడి
చూచి ఆగుడివద్ద ఆసోదాచేసుకొని కూచుండియుండగాబహుమంది నాగ
కన్యకలు ఆదుర్గాగుడికివచ్చి ఆదేవికిపూజలుచేశి నాట్యములాడి వీణెలు
వాయిస్తూవుండిరి - ఆసమయమందు అందులోవక స్త్రీనియితడు మోహిం
చి మనసునిలుపలేక దానిచెలికత్తెతో తనఅభిప్రాయము చెప్పెనుఅం
తనా నాగకన్యక యితని అభిప్రాయము చెలికత్తెవలన తెలుసుకొని స
మ్మతించక అతణ్ని మోసముచెయ్యవలెనని తలచి యతణ్నిపిలిచిమంచిది
నీయిష్టప్రకారమునడిపిస్తాను యీగుంటలోస్నానముచేశిరమ్మనివకగుం
టచూపెనుఅప్పుడుఅతడుచాలా సంతోషించిఆగుంటలో మునగగానేఆ
నాగకన్యకమహిమవల్ల మునుపు తానుండేమల్లి కాపురమందుండే గుంట
లోతేలెను - తర్వాతరాజువద్దికిపోయి యీవృత్తాంతమంతా చెప్పగా
నేరాజుఆశ్చర్యపడినీవు చూచిన స్త్రీనినాకుచూపించవలెనుఅని చెప్పె
ను - పిమ్మటఆకాపాటకుడు మునుపు తానుపోయిన మార్గానరాజును
తోడకపోయిఆదుర్గాగుళ్లో వుండేనాగకన్యకను చూపించెను - అప్పుడు
ఆకాపాటకుడుమోహించిన కన్యకరాజును చూచి మోహించి ఓమ
హారాజా నీకుకావలశినవస్తువులన్నీ యిస్తానునామనస్సులోవుండేకో
రికనెరవేర్పుమనిప్రార్థించిననారాజుఆకన్యంజూచి యిట్లనియె - వో
కాంతా యితడునాకొమారుడువయసువాడుబుద్ధిమంతుడు రూపవంతుడు
ఆడితప్పనివాడు అన్నిటియందు నాకంటే సమర్థుడు ఇతణ్ని కూడిసు
ఖానవుండుము అనిననాకన్య సమ్మతించెను - అప్పుడారాజు కాపాటకుని
చెయిపట్టుకొనినిన్ని క్కన్నియంగూర్చుట నీవిచ్చినయుశిరికపండ్లలోనొక

పంటికి యీాడు యింకొక పండు బాకీ అని చెప్పి మునుపు అతడు మణిగినగుంటలో తాను మణిగి తనపట్నానకు పోయెను కాపాటకుడు ఆ స్త్రీ తోకూడా సుఖంగా వుండెను యీ యిద్దరిలోను యెవరు చేశిన వుపకారం దొడ్డదియని బేతాళుండడిగిన సేవకుండు స్వామికి కావలశిన ఉపచారం చేయడం సరే గనక కాపాటకుడు చేశిన ఉపకారం దొడ్డది గాదు రాజు తాను ఆ మేలు మరవక యిటువంటి ప్రత్యుపకారం చేశినాడు గనక రాజు చేశిన యుపకారమే మిక్కిలి గొప్పది అని విక్రమార్కుండు చెప్పిన బేతాళుం డెప్పటివలె నదృశ్యుడయ్యెను.

తిరిగి విక్రమార్కుండు బేతాళుం బట్టికట్టి తెచ్చు నవసరంబున బేతాళుండు విక్రమార్కునితో నిట్లనియె- వినవోయి రాజా యీ లోకమునందు విజయనగరమను పట్టణంబు గలదందు వంశకేతుండను రాజు గలడు అతడు సత్యవ్రతయనే దాన్ని పెండ్లి చేసుకొని దానిపై నమిక్కిలి మోహము చేత రాత్రి పగులు దాన్ని యెడబాయలేక వుండెను - అతనికి దీర్ఘదర్శియనే మంత్రి గలడు అతడే సకల రాజ్య పాలన చేస్తూ వుండెను అది ప్రజలు చూచి రాజు నశించి వేశి రాజ్యమంతా మంత్రి అపహరించినాడు అని చెప్పుకొనిరి - ఆ మంత్రి ఆనిందపడలేక ఆ దేశము విడిచి మరివక దేశానికి పోయెను- అప్పుడు రాజు తన రాజ్యము మరివక మంత్రి వశము చేశి తా నెప్పటివలెనే అంతఃపురములో పోయి వుండెను - అంత టపరదేశానికి పోయిన మంత్రి అనేక దేశాలు తిరిగి సముద్ర తీరమునం దొక పట్టణము జేరి అక్కడ వక వర్తకునితో స్నేహము చేశి యెల్లప్పుడున్ను అతణ్ని యెడబాయకుండా వుండగా నొకనాడా వర్తకుడు మంత్రిని చూచి నేను వాడ యెక్కి ద్వీపాంతరమునకు పోయి మళ్లీ వస్తాను అందాక నీ విక్కడ వుండి నా కార్యాలన్నీ బాగా విచారించుకొంటూ వుండుము నేను - అప్పుడా మంత్రి వర్తకుణ్ని చూచి నేను

నిన్నెడబాశివుండలేను నీతోకూడావస్తాననెను - అంతనావర్తకుడుఅత
ణ్ని కూడావాడమీద యెక్కించుకొని సముద్రముమీదపోతూవుండగాఅ
క్కడవకద్వీపాంతరములోచక్కనిది వకకన్యకవుండెను దాన్ని మంత్రి
చూచిఆశ్చర్యపడి యిదియెవరని వర్తకుణ్ని అడిగితే నేనువచ్చేటప్పుడం
తాయీస్త్రీని యిక్కడచూస్తున్నాను యిదియెవరోనేనుయెరగను అని
చెప్పెను - అంతట నాయిద్దరున్ను పోయి తమరుపోయినపని కాజేసుకొని
మళ్లీ యింటికి వచ్చిరి - తర్వాతఆమంత్రితనయింటికిపోయి మళ్లీ శీఘ్ర
ముగావస్తానని వర్తకునితో చెప్పి శెలవుపుచ్చుకొనితాను మునుపున్నప
ట్నానకువచ్చి ఆరాజునుచూచిన నతండుసంతోషించిలేచి యాలింగనము
చేసుకొని కూర్చుండబెట్టుకొని కుశలమడిగి నీవునన్ను విడిచి యెందుకుపో
తివి అని అడిగెను ఆమంత్రియిట్లనియె - నీవుస్త్రీలోలుడవై రాజ్యముకొం
చెమైనా విచారించకవున్నందున ప్రజలందరున్ను నేనునీరాజ్యమంతా
అపహరించతలచినానని వాడుకొనిరి గనక ఆనిందపడలేక నేను దేశాంతర
ముపోతిని తర్వాత వకదేశములో వకవర్తకునితో స్నేహము చేసి వాడి
తోకూడా వాడయెక్కి సముద్రముమీద పోతూవుండగా వకద్వీపములో
కాళికాదేవిగుడియుండెను ఆగుడిముందర నొకచెట్టున్నది ఆచెట్టునీడను
వకకన్యకవున్నది ఆకన్యకు సరియైన స్త్రీలు యీలోకములోనెక్కడా
లేరు అనిపలికిన నారాజు ఆశ్చర్యపడి నేనాకన్యకను చూడవలెను కాబ
ట్టినేనువచ్చే నట్టుకు నామారుగా నీవిక్కడవుండు నేనుఅతిత్వరగాపోయి
వస్తాను అనివర్తకుడుండేచోటు గురుతు అడిగితెలుసుకొని అతనివద్దికిపో
యి మహాస్నేహము చేసి అతడుబేరానికిపొయ్యేటప్పుడుఅతనితోకూడా
వాడయెక్కి ఆద్వీపమువద్దికిపోయి అక్కడ ఆకన్యకనుచూచి ఆశ్చర్యపడి
దాన్ని మోహించి దీన్ని యెవరుచూచినాగానీ మనసునిలుపలేరు మంత్రి

మహోదృఢచిత్తుఁడుగనక మనస్సు నిశ్చలంచేసుకొన్నాడు అని అతణ్ని స్తోత్రము చేసి యా కాళికా దేవిగుడికిపోయి యా దేవికి ప్రదక్షిణ నమస్కారములు చేసి స్తోత్రము చేసియా దేవిప్రసాదమును బొందియా కన్యక వద్దికి బోయిన నాచిన్నదియితణ్ని చూచిమరుగుకు పోయెను - అప్పుడా రాజు దాన్ని పట్టుకొనినన్ను విడనాడకు మని ప్రార్థించిన నా స్త్రీ అతడు రాజాధిరాజని యెరిగి అతనిమనసువచ్చినట్టుగా నడుచుకొనెను - ఇట్లా వుండగా వొకనాడు ఆ స్త్రీ వ్రతనిమిత్తము స్నానము చేయవలెనని యొకతటాకంవద్దికిపోయిఅందులో యీదులాడుతున్నవుండగా నొక రాక్షసుడువచ్చి దాన్నిమింగెనుఅదియా రాజుచూచిఖడ్గముదూసుకొనియా రాక్షసుణ్ని చంపి వానిగర్భమందున్న కన్యకనుబయిటికిదీసెను - అప్పుడాకన్యక రాక్షసుడు తన్ను మింగడానకు నిమిత్తము చెప్పి యెప్పటివలెనే రాజుతో యిష్టముగావుండెను - తర్వాత రాజు ఆకన్యకను తనపట్టణమునకు తోడుకపోయి మునుపటికంటె యెక్కువగా స్త్రీలోలుడై వుండెను - అదిమంత్రి చూచివిషము దినిచచ్చెనుగనక వోయివిక్రమార్కా ఆమంత్రి రాజు మళ్లీ వచ్చెననిచచ్చెనో గానుచూచినకన్యక తనకు లభించక రాజుకు లభించెననిచచ్చెనో చెప్పుమని బేతాళుండడిగిన విక్రమార్కుండిట్లనియె - వాడుమృతి బొందినది యెందుకంటే యీరాజు స్త్రీలోలుడని తాను యెరిగి వుండి మళ్లీ ఆకన్యక యొక్క స్థితి చెప్పెగనకనిప్పుడతడు మిక్కిలి స్త్రీలోలుడై రాజ్యముకొంచెమైనా విచారించకపోయెగనక యీయపవాదము యెట్లాసహింతుననిమృతుడయ్యెను అని చెప్పిన బేతాళుండెప్పటివలెనేఅదృశ్యుండై యెప్పటి తనచోటికింబోయితల్లకిందుగా వ్రేలుచుండెను.

యీప్రకారముగా విక్రమార్కుడు బేతాళుణ్ని యిరువైనాలుగు

మాట్లు పట్టుకరాగా తేపతేపకు నొక ప్రశ్న విక్రమార్కునికి బేతాళుడి చ్చును తెలిసివుత్తర్వు చెప్పకపో తేతలసహస్ర వక్కలౌనని బేతాళుడు చెప్పి వున్నాడుగనక ఆప్రశ్నకు విక్రమార్కుడు వుత్తరువు చెప్పను - అంతట బేతాళుండెప్పటియట్ల తనచోటికి జరుగును-తర్వాత యిుకువై అయివోసారి బేతాళుణ్ని పట్టుకొనివస్తూ వుండగా బేతాళుడు విక్రమార్కునితో నిట్లనిరి.

వినవోయి రాజా వొకవూరి నుంచిఆలు మొగుడు వారికూతురు యీ ముగ్గురున్ను కాశికిపోతూవుండిరి మొగుణ్ని దోవలో పెద్దపులితినెను అవతలతల్లిన్ని కూతురున్ను యిద్దరుపోతూవుండిరి - తర్వాత మరి వొక యిద్దరుతండ్రిన్ని కొమారుడున్ను యీతల్లికూతురుపోయిన దోవనేపోయిరి- అప్పుడాదోవలో యిద్దరు స్త్రీలునడచిపోయినట్టుగా అడుగులజాడ అగుపడెను - యీతండ్రిన్ని కొడుకున్ను ఆఅడుగులుచూచి పెద్దఅడుగులదాన్ని తండ్రి పెండ్లాడేటట్టుగానున్ను చిన్న అడుగులదాన్ని కొమారుడు పెండ్లాడేటట్టుగానున్ను సంకేతముచేసుకొని త్వరగా వారినికలియబోయిరి - అక్కడచూచినంతల్లో చిన్న అడుగులది తల్లిగానున్ను పెద్ద అడుగులది కూతురుగానున్ను వుండిరి - తమకు చేసుకొన్న సంకేతము తప్పకుండాచిన్న అడుగులదాన్ని కొమారుడున్ను పెద్ద అడుగులదాన్ని తండ్రిన్ని పెండ్లాడిరి వారికి యిద్దరికిన్ని యిద్దరుకొమాళ్లుగలిగిరి ఆపుట్టిన యిద్దరుచిన్న వాండ్లున్ను తమలోతాము యేమివరసగా పిలుచుకోవలెను చెప్పుమనగా విక్రమార్కునికి యేమిన్ని తోచక బదులువుత్తర్వు యివ్వక వూరుకుండెను - యీవిక్రమార్కుడు మాట్లాడకుండావున్నందున ఆబేతాళుడు తిరిగి పారిపోక నిలిచివుండెను.అంతటఆసన్యాసివద్దికి తన్ను

తీసుకపోతూవుండగా విక్రమార్కునిమీదదయవచ్చి బేతాళుండిట్లనియె-
న్నోరాజా నేను నీగుణములకు మెచ్చినాను - నీకొకమేలైనమాట చెప్పుతు
న్నాను విను - యెట్లంటే యిప్పుడు యీసన్న్యాసి అక్కడ వకశక్తికి పూ
జచేస్తున్నాడు ఆశక్తి సకలగుణసంపన్నుడైన రాజునైనా సకలయో
గసంపన్నుడైన సన్న్యాసినైనా యెవడు తనకు బలి యిస్తాడో నన్ను వాని
వశంచేస్తానని అతనితో చెప్పి వుంది నీవు సకలగుణసంపన్నుడవు గనక ఆ
శక్తికి నిన్ను బలియిచ్చి నన్ను తనవశంచేసుకోవలెనని నన్ను తెమ్మని నీతో
చెప్పినాడు యిప్పుడు నన్ను కొంచపోగానే అతడు నిన్ను శక్తికి సాగిలపడి
మొక్కమంటాడు యెట్లా మొక్కవలెనో నాకు తెలియదు నీవు మొక్కి
చూపించమను - అప్పుడు అతడు సాగిలపడి మొక్కుతున్నాడు అతడు సక
లయోగసంపన్నుడయిన సన్న్యాసిగనక ఆసమయమందు కత్తితో నీవు అత
నితలగొట్టి శక్తి బలి యిస్తే శక్తి నీకు ప్రత్యక్షమై నన్ను నీవశము చేస్తు
న్నది - తర్వాత నేను నీ అధీనముగా నుంటున్నాను అని బేతాళుండు చెప్ప
గా విక్రమార్కుండు విని ఆమాటలకు అనుమోదించి భేతాళుణ్ని తీసుకొని
సన్న్యాసిదగ్గిరికి పోయి బేతాళుణ్ని తెస్తినని చెప్పెను అందుకు సన్న్యాసి సం
తోషపడి విక్రమార్కుణ్ని స్నానము చేసి వచ్చి శక్తికి దండము పెట్టుమని
చెప్పెను - విక్రమార్కుడు స్నానము చేసి వచ్చి దణ్నము పెట్టేటందుకు
నాకు తెలియదు నీవు పెట్టిచూపిస్తే అట్లా పెట్టుతున్నాను - అనగా ఆస
న్న్యాసి శక్తికి దణ్నము పెట్టెను-అప్పుడు విక్రమార్కుడు చంద్రాయుధ
ము తీసుకొని సన్న్యాసి తలకొట్టి శక్తికి బలియిచ్చెను-అంతట ఆశక్తి ప్రస
న్నురాలై బేతాళుణ్ని విక్రమార్కుని వశము చేసెను నీవు యెప్పుడు తలి
స్తే అప్పుడు వస్తానని విక్రమార్కుని వద్ద సెలవుపుచ్చుకొని బేతాళుండు పో
యెను - తర్వాత విక్రమార్కుడు ఉజ్జయినీపురానికి వచ్చి యెప్పటి వలె

మహాన్యాయముగా రాజ్య మేలుతూవుండెను - ఆసమయములో దేవేం
ద్రుడొకనాడు కొలువైయుండి రంభఊర్వసియిద్దరునాట్య మాడుతూ
వుండగా చూచియీ యిద్దరిలో నాట్యమందు యెవరుగట్టివారు చెప్పండి
అని తన సభలోవుండేవారినిఅడిగెను వారిలో కొందరుఊర్వసిఅధిక
రాలనిరి - కొందరురంభఅధికురాలనిరి - కొందరుయిద్దరు సమానమే నని
చెప్పిరి - అందుకొందరు పెద్దలుయిట్లనిరి - భూలోకమందువిక్రమా
ర్కుడనే రాజుగలడు - అతడుభరతశాస్త్రనిపుణుడు యీసంశయం తీరే
టట్టుచక్కగా చెప్పును-అనగా ఇంద్రుడు తనసారధియైనమాతలియనేవా
ణ్ని పిలిచి నీవు శీఘ్రముగా తేరు ఆ యత్తము చేసుకొని భూలోకానికి వి
క్రమార్కుడిదగ్గిరికి తీసుకపోయి నేనుపిలుచుకరమ్మన్నానని మహావినయ
ముగా చెప్పి అతణ్ని యిక్కడికి పిలుచుకరమ్మని చెప్పెను - అప్పుడు సారధి
ఆప్రకారముగా భూలోకానికివచ్చి విక్రమార్కుణ్ని చూచి - అయ్యా దే
వేంద్రుడునిన్ను తనదగ్గిరికి పిలుచుకరమ్మని చెప్పినాడు - అనిచెప్పగా వి
క్రమార్కుడు చాలాసంతోషించి అతనికి సకలబహుమానాలుచేసి ఆదె
వేంద్రుడిరథము మీద యెక్కి మాతలిరథముతోలగా దేవేంద్ర సభకు వ
చ్చెను - అప్పుడు దేవేంద్రుడు యీరాజునుచూచిచాలాసంతోషించిలేచి
ప్రత్యుత్థానముచేసి అర్ధాసనముమీద కూచుండబెట్టుకొని నీవు బ్రా
హ్మణోత్తములవల్లసకలవిద్యలు గ్రహించినావు మహాబుద్ధిమంతుడవు
రంభ ఊర్వసి యిద్దరు నాట్యమాడుతూవుండగా నీవుచూడవలెను చూచి
వారియిద్దరిలో తారతమ్యము చెప్పవలెను - అనిరంభనున్ను ఊర్వసినిన్ని
నాట్యమాడ నియమించగా వారినాట్యమునువిక్రమార్కుడుచూచిసం
తోషపడి యింద్రుణ్నిచూచి యిద్దరున్ను బాగా నేర్చినవారే అయినప్పటి
కిన్ని రంభకంటే ఊర్వసికొంచెమధికురాలుఅని చెప్పెను - అప్పుడు దేవేం
ద్రుడు మొదలయినవారువిక్రమార్కునిబుద్ధికి మెచ్చి సంతోషపడిరి - యిం

ద్రుడువిక్రమార్కునికిముప్పైరెండుమెట్లున్నుముప్పైరెండుబంగారుప్ర
తిమలున్నుగలిగి-నవరత్నస్థగితమైనసింహాసనమిచ్చినీవుయీసింహాసనము
భూలోకానికి కొంచపోయి దీనిమీద కూర్చుండిభట్టిప్రధానితో గూడు
కొని వెయ్యేండ్లు రాజ్య భారము విచారించు కొంటూ సుఖానవుండు మనిదీ
వించిమాతలి నిపిలిచిరథము మీదవిక్రమార్కుణ్ని కూచోపెట్టు కొనిపో
యిఉజ్జయినీనగరములో విడిచిపెట్టి రమ్మని సెలవిచ్చెను - తర్వాత మా
తలిసింహాసనముతో కూడావిక్రమార్కుణ్ని రథముమీద కూర్చుండ
బెట్టుకొనిభూలోకానికి పోయి ఉజ్జయినీనగరములోప్రవేశ పెట్టి అత ని
చేతఅనేకములయినబహుమానములు పొందితిరుగాస్వర్గలోకానికి పో
యెను అప్పుడు విక్రమార్కుడుభట్టి మొదలయినమంత్రులతోనున్ను పు
రోహితులతోనున్ను ఆప్త జనులతోనున్ను తానుయింద్రలోకానికి పో
యినదిన్ని అక్కడనడిచిన వర్తమానమున్ను చెప్పి బ్రాహ్మణు లనుపిలి
పించిశుభలగ్నముని చారించ నియమించి వారువిచారించి చెప్పినశుభల
గ్నమందుషోడశమహాదానాలుచేసిపంచమహావాద్యాలు మోగగా దేవేం
ద్రదత్తమైనసింహాసనమెక్కి లోగడభట్టి చెప్పినప్రకారముగా వెయ్యేం
డ్లు రాజ్య పరిపాలనమున్ను వెయ్యేండ్లుభూసంచారమున్ను చేసెను - త
ర్వాతఉజ్జయినీనగరములో మహోత్పాతాలుపుట్టెను. అప్పుడువిక్ర
మార్కుడు తనకుజీవితకాలముముగిసెగాబోలుఅయితేకాళికాదేవివర
మిచ్చేటప్పుడుచెప్పినమాట పదమూడు నెలల చిన్న దానికిపుట్టినవాడు
నిన్ను చంపును వాడువినాగా మరియెవరున్ను నిన్నేమిచెయ్య లేరనిగదా
అటువంటి వాడుయిప్పుడుయెక్కడపుట్టివున్నాడోవిచారించవలెనుఅని బే
తాళుణ్ని తలుచు కోగానే బేతాళుడు యెదుట నిలిచెను - బేతాళునితో
యీవర్తమానముచెప్పి అంపించెను - అంతట బేతాళుడువిక్రమార్కుని
చేత శెలవుతీసుకొనిసకలమైనవూళ్లున్నుపల్లెలున్నుపట్ణములున్ను అడవులు

న్ను వెతుకుతూ పోగా ప్రతిష్ఠాపురమనే పట్టణమునందు వొక కుమ్మరయిం
టిముందర మట్టితో యేనుగలు గుర్రాలు రథాలు కాల్బలాలు చేశి అందులో
కొందరిని మంత్రులనుగా యేర్పరచి వారితో మాట్లాడుతూవుండే వక చిన్న
వాణ్ని చూచి వీడు యెవ్వడని అక్కడవున్నవారిని అడగగా వక కుమ్మరకన్యకకు
పుట్టిన వాడు అని చెప్పిరి - తర్వాత ఆకుమ్మరవాని యిల్లుగుర్తు అడిగి తెలుసు
కొని వాణ్ని అడగగా వాడు యిట్లనియె - నాకొమార్తె యేటివిూద వక నెలది
అయివుండగా నాగేంద్రుడు వచ్చి భోగించెను - అంతట ఆచిన్నదానికి గ
ర్భమయి యీశిశువు పుట్టెను వీడికి శాలివాహనుడు అని పేరు బెట్టినాము
అని చెప్పగా బేతాళుడు ఉజ్జయినీనగరానకు వచ్చి యీ చిన్నవాడి వృత్తాం
తం విక్రమార్కునితో చెప్పి అంతర్ధానమై పోయెను అంతట విక్రమా
ర్కుడు కాలచోదితుడై భట్టితో గూడుకొని యుద్ధసన్నద్ధుడై చతురంగ బల
ముతో దండెత్తి ఉజ్జయినీపురము బైలువెల్లి రణభేరి వేయించి ప్రతిష్ఠాపురము
దగ్గిరికి వచ్చి తాను యుద్ధానికి వచ్చినానని శాలివాహనునికి చెప్పిఅంపించె
ను - అప్పుడు శాలివాహనునికి నాగేంద్రుడు ప్రత్యక్షమై మంత్రోప
దేశము చేసి యీమంత్రము నీవు జపించినట్టాయెనా తలిచిన కార్యమంతా
అనుకూలమై వచ్చునని అనుగ్రహం చేసి అదృశ్యుడై పోయెను - ఆశాలి
వాహనుడు మునుపు ప్రతిదినమున్ను ఆవూళ్లో వుండే వొక్కొక్క కుమ్మ
రవాని యింటికి పోయి వాడు కుండలు చేశేటందుకు తొక్కి పెట్టుకొన్న మ
న్నంతా యేనుగలు గుర్రాలు రథాలు కాల్బలాలు చేశి అక్కడవుంచుతూ
వచ్చును - అది వాండ్లు చూచి యితడు మనుష్యమాత్రుడు గాడు కాబట్టి
యేమంటే యేమి మోసము వచ్చునో అని వూరికె వుందురు - యీప్రకా
రము చేశిన యేనుగలు గుర్రాలు మొదలయిన చతురంగ బలములున్ను వొ
క్కొక్క యింటవేసును ఆయింటి వాండ్లున్ను ఇతణ్ని యేమీ అన వెరుతురు

యిట్లా యింటింటా నించినమంటిబొమ్మలమీదఆచిన్న వాడుమంత్రోదక ము ప్రోక్షించెను - ప్రోక్షించగానే అవిఅన్ని న్ని లేచిమనుష్యరూపప్రతిమలుమనుష్యులవలెనున్ను యేనుగరూపప్రతిమలుయేనుగలవలెనున్ను యింకా యేయేరూపములుగా చేసివున్న ప్రతిమలుఆయారూపములుగానున్ను తిరుగులాడసాగెను అప్పుడుయీశాలివాహనుడుయుద్ధసన్నద్ధుడై రణభేరి వేయించి విక్రమార్కుని మీదికి జగడానికి పోయెను - విక్రమార్కుడికిన్ని శాలివాహనునికిన్ని దేవాసురులయుద్ధము వంటి యుద్ధముజరిగెను - శాలివాహనుని సేనలు మంత్ర బలము కలిగినవిన్ని విక్రమార్కుడి సేనలుమనుష్య బలము కలిగినవిన్ని గనక విక్రమార్కుని సేనలు వోడిపోయెను - అంతటవిక్రమార్కుడు వొంటిగా నిలిచెను కాలవశము చేత శాలి వాహనుడు విక్రమార్కుని తలతన చేతిఖడ్గము చేత తెగవేశెను - అతడుమహా బాహుబలము గలవాడు గనక తెగినతలఉజ్జయినీనగరములో పడెను.

అప్పుడక్కడివారందరు చాలాదుఃఖించివిక్రమార్కునికిఅగ్నిసంస్కారాదులు శాస్త్రోక్తప్రకారముగా చేశిరి - ఆవిక్రమార్కుడు చనిపోయ్యేటప్పటికిఅతని భార్య గర్భిణిగానై యుండెను - అనంతరంకొమారుణ్ని గనెనుఆకొమారునికి మంత్రులు మొదల యిన వారు జాతకర్మాదులు చేయించి చదువుసాములు నేర్పించిపట్టముగట్టిరిఅప్పుడు అతడుతనతండ్రికిదేవేంద్రుడిచ్చినటువంటి సింహాసన మెక్కపోగానేఆకాశవాణితండ్రిచచ్చినవెనక పుట్టినవాడుయీసింహాసనమెక్కగూడదుకాబట్టి నీవుమీతండ్రిచచ్చినతర్వాతపుట్టినావుయీసింహాసన మెక్కేటందుకుఅర్హుడవుకావని చెప్పెనుఅంతటఆసింహాసన మెక్కడంచాలించుకొని వేరే మరియొక్కరాజార్హమైనసింహాసన మెక్కితండ్రికంటె యెనుమిక్కిలిగా

రాజ్య పరిపాలనము చేసెను మున్నుపటిసింహాసనము మంత్రులు మొదల
యినవారు భూస్థాపితము చేశిరి.

మరికొంత కాలానికి వక బ్రాహ్మణుడు ఆసింహాసనం నిక్షేపించిన
భూమిలో దున్నించి జొన్న విత్తించెను - అది ఫలించిన వెనక ఆచేలో నె
కమంచె వేశెను ఆమంచె మీద కూర్చున్నప్పుడు దోవను వచ్చే వాండ్లను
పొయ్యే వాండ్లను పిలిచి జొన్న పిశికిళ్లు తిని అలుపుతీర్చుకొని పొండని చెప్ప
ను మంచె దిగివచ్చినప్పుడు ఆకంకులు విరిచే వాండ్లను చూచి యిది యేమి అ
న్యాయము నాచేనంతా యిట్లా కొల్లపెట్టుతున్నారేమి అని మొఱపెట్టు
ను - యీసమాచారము ధారాపురాధీశ్వరుడైన భోజరాజు విని వొక
నాడు తన మంత్రులతో కూడా సేనలను వెంటబెట్టుకొని ఆచేని దోవను పో
తూ వుండగా ఆ బ్రాహ్మణుడు మంచె మీద నుండి వో రాజా నీవున్ను నీ సే
నలున్ను పండిన చేను చూస్తూ వూరికె యేల పొయ్యేరు జొన్న వూచబియ్యం
కావలశినట్టు తిని పొండి అని చెప్పగా ఆ రాజు తన సేనతో కూడా చేలోకి
పోయి కంకులు విరుస్తూ వుండగా యింతలో యేమోపని కోసము ఆ బ్రా
హ్మణుడు మంచె దిగెను - అప్పుడు రాజును చూచి - వో రాజా నీవు ధర్మ
స్వరూపుడవు అన్యాయము చేశే వాండ్లనంతా శిక్షించి న్యాయమార్గా
నికి తెచ్చే వాడవు నీవే యిట్లా అన్యాయమునకు లోబడి నాచేనంతా కొల్ల
పెట్టితే నేను యెవరితో చెప్పుకొందును అని బ్రాహ్మణుడు మొఱపెట్టగా
భోజరాజు ఆశ్చర్యపడి మంత్రులను చూచి యిది యేమి చోద్యము మంచె
మీద వున్నప్పుడు వూచ బియ్యం తినుమనెను మంచె దిగగానే యిది యేమి అ
న్యాయమని మొఱపెట్టుతున్నాడు అని యడుగగా యిది బ్రాహ్మణుడి గుణ

మువల్లనయినది కాదు యీభూమిగుణమువల్లవచ్చినదని మంత్రులు నిశ్చయించి చెప్పిరి అంతటనారాజుఆబ్రాహ్మణునిపిలిపించి ఆచేనుకనేధాన్యముకంటే నాలుగంతలు యిస్తాము ఆచేనుమాకు విడిచిపెట్టుమని చెప్పగా బ్రాహ్మణుడు సమ్మతించెను - తర్వాత రాజు ఆచేనుకనేధాన్యముకంటే నాలుగంతలు యెక్కువ యిప్పించి యింకాకొంత ధాన్యము యిప్పించగా ఆబ్రాహ్మణుడు నిండాసంతోషపడి తనయింటికిపోయెను - అటుపిమ్మటఆమంచెపెల్లగించిదానికింద తొవ్వి శోధించగాఅందులోనవరత్నఖచితమైమూపైరెండుప్రతిమలుగలిగి దేదీప్యమానమైనసింహాసనముండెను - అదిచూచి భోజరాజు చాలాసంతోషపడి తనపురానికి యెత్తించుకపోయి కొలువుకూటమందుఆసింహాసనముంచిమంత్రులనుచూచి మీబుద్ధివల్లగదాయీ సింహాసనము కలిగెనుఅనిస్తోత్రము చేయగానందులోనేకమంత్రియిట్లనియె.

వినవయ్యా వోరాజశ్రేష్ఠుఁడామంత్రి చెప్పినట్టువినేరాజుకలిగితేరాజ్యముబహుచక్కగావుండును-రాజుమంత్రిమాటలు విననివాడాయెనాఆరాజ్యముచెడిపోను రాజు తనమాటలు విననివాడైనప్పటికిన్ని మంత్రి బహుసమర్థుఁడైనట్టయితేతగినఉపాయాలు చేశిరాజ్యము చెడకుండాపట్టుకవచ్చునుదీనికి పూర్వ కథయొకటికద్దు అదియేలాగంటే - విశాలపురమునేపట్నమున నందకుడనే రాజుగలఁడు - ఆరాజుకు బహుశ్రుతుడనేమంత్రి గలఁడు- ఆరాజుభార్యపేరు భానుమతి-ఆభార్యమీద నిండా మోహముచేత రాజునగరు వెళ్లిబైటరాకుండావుండగా యొకనాడు రాజుతోమంత్రి యిట్లనియె - అయ్యా మీరు భానుమతిమీది మోహము చేత అంతఃపురములో నుంచిబైటరాకుండా వుంటేరాజ్య విచారణ మట్టు అయినందు చేతపరరాజులు వచ్చి రాజ్యమాక్రమించుకో

రాత్రిళ్లు నిద్రకు ఆమెను చూడక వుండ లేనట్టయితే ఆమె వలె వక ప్రతిమను
చేయించి దగ్గిర వుంచుకొండి అని చెప్పగా రాజు సమ్మతించి వక ప్రతిమను
చేయించి దానికి వర్ణం వ్రాయించుమని చిత్తరువు చేసెను అప్పుడా మం
త్రి వర్ణము వ్రాసే వాణ్ని పిలిపించి దీనికి చక్కగా వర్ణము వ్రాశి తెమ్మ
ని చెప్పెను వాడు వర్ణమంతా వ్రాశి కన్నులకు దృష్టి పెట్టేటప్పుడు
తూలిక కొన కాటుక చెదిరి తొడమీద పడెను. ఆ కాటుకకడా పటతుడిచి వేతా
మనుకొని తుడవగా మరి చెదిరి పోయెను - తర్వాత ఆ ప్రతిమను రాజుకు కొంచపో
యియివ్వ బోయ్యేటప్పుడు జ్ఞాపకం వచ్చి ఆ చుక్క తుడవవలెనని ప్రయత్న
పడుతూ వుండగా ఆ రాజుకు గురువైనటువంటి శారదానందుడు పద్మినీ జాతి
స్త్రీకి తొడయందు నువ్వు గింజంత మచ్చ వుండునని యెంచి ఆ చుక్క వుండ
వలశిన దేవుంచుమని వర్ణము వ్రాశే వానితో చెప్పెను - తర్వాత వా
డు ఆ ప్రతిమను రాజుకు యివ్వగా నేరాజు చూచి తొడమీద చుక్క యేమ
ని వాణ్ని అడిగెను - అయ్యా నేను కన్నులకు దృష్టి వుంచేటప్పుడు తూలి
క కొన కాటుక చెదిరి తొడపైన బడది అది నేను తుడవ బోతే శారదానం
దుడు ఆ చుక్క వుండవలశినదే తుడవవద్దని చెప్పినాడు కాబట్టి వుంచితి నని
వాడు చెప్పెను - అంతట వాణ్ని పొమ్మని రాజు అంతఃపురములోకి పోయి
తన భార్య తొడను మచ్చ వున్నదేమోనని చూచెను - ఆమె తొడయందు
ఆ మచ్చ వుండెను - అప్పుడు శారదానందుడు అంతఃపుర ద్రోహిగదా
యని యెంచి శారదానందుని తలకొట్టి వెయ్యమని మంత్రికి ఆజ్ఞాపించెను
అప్పుడు మంత్రి శారదానందుడు శాస్త్రజ్ఞుడుగనక ఆ జాతి స్త్రీకి తొడయం
దు మచ్చ వుండునని శాస్త్ర దృష్టి చేతను తెలిశి చెప్పినాడు అంతే కాని
అంతఃపుర ద్రోహిగాడు యీయాజ్ఞ మన్నించవలశినదని బహు విధము
లుగా రాజుతో చెప్పెను - యెంత చెప్పినప్పటికిన్ని వినక రాజు మంత్రి
మీద కోపగించుకొని యిక మీదయినను గురించి మారుమాట చెప్పినట్టయి

తేనిన్ను కూడా ఆజ్ఞ చేయింతునని చెప్పెను - అంతట మంత్రి శౌరధానం మణ్ని అవతలికి పిలుచుకపోయి వకరహస్యమైన స్థలమందు అతణ్ని దాచి వకమృగమును చంపి ఆనెత్తుటికత్తి రాజుకు చూపించెను.

మరికొన్నాళ్లకు ఆరాజకొమారుడు విజయపాలుడనేవాడు వేటకుపోవలెనని ప్రయాణమై పోగా అవశకునాలు ఆయెను - అందుకు మంత్రిన్ని మరిన్ని యింకా కొందరు పెద్దలున్ను నేటిదినం నిలిచి రేపు పొద్దున లేచి పొమ్మని విజయపాలునితో చెప్పిరి - అతడు వారి మాటలు నిరాకరించి తన్ను అవశకునాలు యేమి చేసునో చూతామని వేటకుపోయెను - అట్లా పోయి పోయి వకఅడివి ప్రవేశించి అనేకమైన మృగములను వేశి వకఅడవిపందిని చూచి దానివెంట తగిలి తరుముకొనిపోయెను ఆపంది యెంత దూరము తరిమినప్పటికిన్ని ఆరాజుకొమారుడికి చిక్కకనే పోయెను అప్పుడాతనితో కూడా వచ్చిన సైన్యమంతా యెక్కడనో తప్పిపోయెను - అంతటయీ రాజకుమారుడు తనసైన్యమును గానక పంది వెంట తరుముకపోయినందున నిండా అలిశి గుర్రమును దిగి గుర్రాన్ని వకచెట్టుకు కట్టివేశి అక్కడ వక గుంట వుండగా అందులో నీళ్లు దాగపోయెను ఆగుంటవద్ద నొకపెద్దపులి వుండి ఇతణ్ని తరుముకొని వచ్చెను దాన్ని చూచి గుర్రం తెంచుకొని పరిగెత్తిపోయెను రాచకొమారుడు చాలా భయపడి వకచెట్టు యెక్కెను అక్కడ వక యెలుగుబంటి వుండెను దాన్ని చూచి యితడు గడగడ వణుకుతూ వుండగా ఆయెలుగుబంటి యీ విజయపాలుణ్ని చూచి వీడు దొడ్డ రాజు యొక్క కొమారుడు పులిభయము చేత చెట్టు యెక్కినాడు చెట్టుమీదనన్ను చూచి - కిందపులి వున్నదని చెట్టెక్కితే పైన యెలుగుబంటి వున్నది యేమి చేతును దైవమా చెట్టుమీద వుంటే యిది యేమి చేసునో కిందదిగితే పులి యేమి చేసునో అనిఅంటా

భయపడ్డాడు కాబట్టి యిటువంటి వేళలో యితనిదిగులు దీర్చి కాపాడినట్ట యితేనిండా పుణ్యము వచ్చునని తలచి అతణ్ని ఆదరించి దగ్గిరికి రమ్మని జ డుపు తీర్చేను యింతలో పొద్దు గూకెను పులిన్ని చెట్టు కిందనే వుండెను విజయపాలుడు అలసటచేత నున్ను భయముచేత నున్ను ఆకలిచేత నున్ను కూరిక పాటుపడుతూ వుండగా యెలుగ్గొడ్డు చూచి వోయి రాచకొమారుడా నీవు భయ పడక నీతలనా తొడమీద పెట్టుకొని నిద్ర పొమ్మని చెప్పెను - అంతటకొంత దిగులు దీరి అతడు నిద్ర పోయెను - అతడు నిద్ర పోవడము పులిచూచి యెలుగు గొడ్డుతో వినువో భల్లూకమా మనజాతివారిని యీరాజు యెందరిని చంపినాడో మీరున్ను మేమున్ను యీ అడవిలో వక తల్లి బిడ్డలవలె వున్నాము- మనకు శత్రువైనవాడు చిక్కినప్పుడు వాణ్ని చంపవలెగాని కాపాడుదురా కాబట్టి వీణ్ని కింద పడత్రొయ్యమని చెప్పెను - ఆమాటకు యెలుగు నవ్వి మాజాతిలో నమ్మించి మోసము చేశేది లేదని చెప్పగా పులి యిట్లనియె.

వో భల్లూకమా నామాట విను మనిషిని నమ్మరాదు మునుపు మనిషిని నమ్మిన పాము నెచ్చి పోయెను - అదియేలాగంటే - వింధ్యపర్వతము దగ్గిర నెక అడివిలో యేకలుడనే బోయవాడు ప్రతిదినమున్ను వృక్షాలు కొట్టి చీలవేశి ఆచెక్కలంతా మోపుగట్టుకొని కొంచ పోయి అమ్ముకొని జీవనం చేస్తూ వుండగా వొకనాడు వొకమంచి గంధపుమాను అగుపడెను - ఆమాను నరుకుతూ వుండగా దానికింద వుండే పుట్టలోనుంచి వక నాగుబాము వెళ్లి వచ్చి వాణ్ని చూచి వోయి యీమాను నరికి అమ్ముకుంటే నీ దారిద్ర్యము తీరునా నాతో స్నేహము చేస్తివా యెనా కావలశినది కలుగును అని తనతలను వున్న రత్నము యిచ్చి ముందర నీకు కావలశినన్ని రత్నాలు యిస్తున్నాను పొమ్మని చెప్పెను - అంతట వాడు - ఆరత్నం అమ్మి ఆరూకలు అన్నీ పెట్టుకొని

కావలశిన వస్తువులుకొనుక్కొని యథేష్టముగాఅనుభవిస్తూవుండి మరికొన్నాళ్లకుఆధనం అయిపోగానే తిరిగి యీనాగుబాము వద్దికి వచ్చి రత్నములుకొంచపోతూ వుండెను - తర్వాత వకనాడు - మనము కావలశినప్పుడంతాయిక్కడికివచ్చి యీపామును అడిగితే వొక్కొకరత్నమేకడాయిస్తుందియీపామును చంపిపుట్టతొవ్వినట్టయితేయిక్కడవుండే రత్నాలన్నిన్నివొక్కసారిగానే తీసుకపోవచ్చునని - ద్రోహచింతచేతమో పెడుగడ్డి తీసుకపోయి ఆపుట్టమీదవేశి కాల్చిఆపామునుచంపిపుట్టతొవ్వి చూస్తే అందులోయేమిన్ని లేకపోయెను తర్వాత యింటికి రాగానేదివాణపువారు - యీకట్టెలమ్ముకొనేవానికి యింతభాగ్యమెక్కడనుంచివచ్చి నదిపీడికి నిక్షేపము దొరికినదిగాబోలునని వానియిల్లు సర్వస్వమున్నదోచుకొనిరి-మనుష్యులుమిత్రద్రోహముచేసేవారుకాబట్టి వీళ్ళకిందతొయ్యమని చెప్పగాయెలుగుపులిని చూచియిట్లనియె.

ఓ వ్యాఘ్రమా పూర్వ కాలమునందు పులినినమ్మి వొకపక్షి చచ్చిపోయెను - అదియేలాగంటే - వొక అడివిలో పులిమృగాలనుపట్టి భక్షిస్తూవుండును వొకనాడు కారెనుమునుబట్టి తినగాదాని యెముకపండ్లసందునగుచ్చుకొని వూడిరాక నెత్తురుచీముకూడి నిండానొప్పిచేసెను - అప్పుడుపులినిండానొప్పిచేత వొకచెట్టుకింద నోరుతెరుచుకొని - యీయెముక యెట్లావూడివచ్చునుయెట్లాబ్రతుకపోతాను యేమిచేతును అని - బహుదుఃఖిస్తూఆచెట్టుమీద నొకపక్షినిచూచి వోపుణ్యాత్మురాలా నేను యిట్లాప్రయాసపడుతూవున్నాను నానోట్లోయెముకతీసినన్ను బ్రతికించితివాదినదినమున్ను నేను తెచ్చుకొన్న ఆహారములోనీకు కావలశినంత యిస్తున్నాను యింతమాత్రముపకారము చెయ్యమనిప్రార్థించగాఆపక్షికి

దయపుట్టి చెట్టు దిగివచ్చి పులి నోట్లో దూర్చిగుచ్చుకొన్నయెముక ముక్క నుబట్టి తీశి వేసెను - తర్వాత పులి క్రమతీరి సుఖముగా నుండి దినదిన ము న్నతాను తెచ్చుకొన్న ఆహారములో ఆపక్షికి కావలశినంత ఆహారము యిస్తూ వచ్చెను - యిట్లా వుండగా వొకనాడు ఆపులికి యెక్కడా ఆహారము దొర కలేదు నాడు తిరుగా ఆచెట్టు క్రిందికి వచ్చి నోరు తెరుచుకొని దుఃఖ పడు తూవుండెను - ఆపక్షి పులిని చూచి నేడేమి బహు విచారపడుతున్నా వనిఅ డిగితే మునుపు నీవు చేసినయుపకారం నేను మరవలేను - యిప్పుడు తిరుగా పండ్ల సందున యెముక చిక్కుకొన్నది అని పులి చెప్పెను - అప్పుడు పక్షి యె ముక తీయవలెనని పులి నోట్లో దూరగానే పక్షిని పులి నమిలి వేసెను కాగా పు లిని నమ్మరాదు-అని యెలుగు చెప్పుచుండగా విజయపాలుడు మేలుకొనెను. అప్పుడు యెలుగు అతణ్ని చూచి యిదివరదాకా నీవు నిద్ర పోతివి గదా యిక మీద నీతొడమీద తల బెట్టుకొని నేను నిద్ర పోతాను యెచ్చరికగా వుండు పులి మోస పుచ్చును నీవు దానిమాటలు వినవద్దు అని చెప్పి రాజు తొడమీద తల పెట్టుకొని యెలుగు నిద్ర పోగా పులి చూచి- వోయి రాచకొమారుడా యెలుగును నమ్మ వద్దు నిన్న రెండు ఝాముల వేళను నేను వకణ్ని తరుముకొని వస్తిని వాడు భ యపడి చెట్టు యెక్కెను వానితో అబద్ధపు బాసలు చేసి వాణ్ని యామరించి సాయంకాలం విరుచుకతి నేను నిన్నున్న అట్లా గేతినవలెనని వున్నది దాన్ని గనక కిందతోస్తి వాడాన్ని తిని నాదోవను పోతున్నాను నీవున్ను మీ వూరికి పోవచ్చును - అని చెప్పగా అతడు విని యెలుగును దిగువకు తోసెను యిం తలో యెలుగు యెచ్చరికై పడి కొమ్ములుపట్టుకొని దిగువ పడకుండా చెట్టు మీ ద నే నిలిచి - తాను దిగువ పడక పోవడం చూచి భయపడే రాచకొమారుణ్ని చూచి - వోయి నీవు జడియవద్దు నీవు యెంత ద్రోహం చేసినా నేమి నేను ద్రోహము తలచను అని ఆదరించెను యింతలో తెల్లవారెను పులిన్ని తెల్లవా

రినదను శా కాచు కొనివుండి ఆశ విడిచి పెట్టి అడివిలో సంచరించబోయెను తర్వాత యెలుగ్గొడ్డు రాచకొమారుణ్ని చెట్టు దించి అడివి దాటించి దోవలో విడిచిపెక్క పోయెను అంతట విజయపాలుడు తాను చేసిన మిత్ర ద్రోహంవల్ల పిచ్చిపట్టి-ససేమిరా అనేమాటవినాగా మరివొకమాటమాట్లాడేదిలేదు - విజయపాలుడు యేమైపోయెనో అని అతనితండ్రి విచారపడి అడివితమామున్న వెతకమని తనభటులను అంపించినాడు వారు వెతుక్కొంటూవచ్చి రెండు ఝాముల వేళకు విజయపాలుణ్ని కనుక్కొని మీరాగుర్రం యేమయిపోయెను నిన్న మీరుయెక్కడవుంటిరి అని వారు అడగగా ససేమిరా అనేమాట వినాగా వేరేమాట చెప్పకపోయెను - వెతకవచ్చిన వాండ్లలోకొందరు పోయి యీసమాచారం రాజుకు చెప్పిరి రాజు వినినిండా విచారపడి అతణ్ని యింటికి యెట్లాగైనా పిలుచుకరమ్మని ఉత్తర్వు చేసెను వారు అతణ్ని పిలుచుకపోయి రాజుకు వప్పగించిరి రాజున్ను తనదేశములో వున్న వైద్యులను పిలిపించి వారికి కొమారుణ్ని చూపించెను యెవరున్ను దానికి చికిత్స చెయ్య నేరక పోయిరి అప్పుడు రాజు - తమగురువు శారదానందుడైనా వున్నట్టయితే ఆయన యీపిచ్చి యిదివరకు మాన్పును . అన్యాయంగా ఆయనను ఆజ్ఞ చేయిస్తిని యికనేమి చేతును యీపిచ్చి యెవరివల్ల కుదురును అని నిండా విచారగ్రస్తుడై యెవరైనా యీపిచ్చి కుదిర్చితే వారికి నా రాజ్యములో సగము రాజ్యమిస్తున్నాను అని దేశమంతా చాటించ పంచెను - మరునాడు మంత్రి రాజును చూచి మన శారదానందుని కొమార్తె తాను యీ వెర్రిమాన్ప గలనని సమాచారమంపించినది అయితే ఆమెను పరపురుషులు చూడకూడదు ఆమెకు తెర వేయించి తెర చాటున మనము వుండవచ్చునని చెప్పెను-రాజు సమ్మతించెను-మంత్రిన్ని ఆ శారదానందుణ్ని రహస్యముగా తన యింటికి పిలిపించి తెర వేయించి రాజున్ను

రాచకొమారుణ్ని న్ని పిలిపించి తెరచాటున నిలిపెనుఅప్పుడుశారదానం
దుడు తెరలోనుండి - సజ్జనులు చెప్పి నమాట వినకపోరాదు అగత్య ముని
నవలెను అనిచెప్ప గానే రాచకొమారుడు మొదటి అక్షరము విడిచిపెట్టి -
నేమిరాఅని చెప్ప సాగెను - తర్వాత నేనలనువిడచిరాచకొమారుడు సం
చరించ రాదు నేనలతో కూడానే సంచరించవలెను - అని శారదానందు
డు చెప్ప గానే రెండు అక్షరాలు విడిచి - మిరాఅని చెప్ప సాగెను - మెం
తఆపదవచ్చి నప్పటికిన్ని మిత్రద్రోహం చెయ్య రాదుఅని మూడో సారి
శారదానందుడు చెప్ప గానే మూడు అక్షరాలు విడిచి - రాఅనిమాత్రం
చెప్ప సాగెను - రాజు బుద్ధిమంతుడై యేపనిఅయినా బాగా విచారించి చే
శేవాడయితే యిటువంటి ఆపదలురావు బాగావిచారించక చేసేవాడుగ
నక యిటువంటివి సంప్రాప్తమాయె ననినాలుగో తేప శారదానందుడు చె
ప్ప గానే ఆనాలుగు అక్షరాలున్ను విడిచిపెట్టి గురుప్రసాదమువల్లయథాప్ర
కారముగా మాట్లాడసాగెను - అప్పుడుమంత్రి ఆరాచకొమారుణ్ని చూ
చినీవు పోయినవిధమేమి అనిఅడగగా తానువేటకు పోయినవృత్తాంతం చె
ప్పెను - ఆవృత్తాంతము విని రాజు ఆశ్చర్య పడియీప్రకారము అడివి
లోనడిచిన సంగతినీవుసూచనగా చెప్పితివే నీకుయెట్లా తెలిసెననిశారదా
నందుల కూతురనే పేరుబెట్టుకొని తెరలోనున్న శారదానందుణ్ని అడిగితే
శారదానందునకు భానుమతి తొడమీదిమచ్చ యెట్లా తెలిశిందోఅట్లా నే
తెలిశింది అనిచెప్పెను - అంతటరాజుఆమాటవిని అయ్యో గురువును అ
న్యాయంగా చంపిస్తినివారిప్రభావమువల్ల వారికిఅన్నివర్తమానములున్ను
తెలుస్తున్నవిఅది నేనువిచారించక ఆయనరాణి వాసద్రోహి గదాఅనిని
శ్చయముగా యెంచుకొంటినిఅనివిచారపడుతూవుండగామంత్రి రాజును
చూచిమీరు విచారపడవద్దుమీగురువునుచూడవలెననిమనసువున్నట్టయితే
యిప్పుడుచూడవచ్చునని తెరతీశి శారదానందులను చూపించెను - అప్పు

డు శారదానందములను చూచి రాజు బహుసంతోషించి మొక్కి మంత్రిని కౌగి లించుకొని రాజ్య మంతా మంత్రిని విచారించుకొమ్మని శెలవిచ్చి తానుగురు వున్న మంత్రిన్ని చెప్పి నప్ర కారంనడుచు కొంటూవుండెను.

అనిమంత్రి చెప్ప గావిని భోజరాజు సంతోషపడి మంత్రికిబహుమా నము చేశి బ్రాహ్మణులకు షోడశ మహా దానాలున్ను చేశి పట్నం అలంక రించుమని చాటించేటట్టు చేసి - తాము సకలాభరణ భూషితుడై పెద్దలు నిర్ణయించి చెప్పి నశుభముహూర్తమునందు సింహాసన మునకు ధూ పదీపాదులు సమర్పించి భేరీమృగంగాది పంచమహా వాద్యములు మ్రో గగా బ్రాహ్మణాశీర్వా దములుగైకొని భోజరాజు సింహాసనమెక్క పో గానే మొదటి సొపానమందుండే ప్రతిమ భోజరాజును చూచియిట్లనియె.

వినుమో భోజరాజా విక్రమార్కునికి గలసాహసాది గుణములుకలి గితే నే కాని యీముప్పై రెండు ప్రతిమలు గలసింహాసన మెక్కరాదునిలు వుమనగా రాజుఆశ్చర్య పడి-బహుప్రయత్నము చేసిసింహాసనమునెక్క వస్తే యెక్కవద్దనడానకు హేతువుయేమి విక్రమార్కునికి గల సాహసా దిగుణాలు మాయందు లేవాఅని - అడిగెను - అందుకు ప్రతిమనవ్వి యిట్ల నియె నోరాజా నిన్ను నీవే స్తోత్రము చేసుకోవద్దు అందువనీవు చేసిన పు ణ్యమునశించి పోను అదియెలాగంటే - పూర్వ కాలమునందు నందనవ నుండనే రాజు గలడు అతడుదినమున్ను లక్షబ్రాహ్మణులకుషడ్రసోపేత ముగా అన్న దానం చేసును- వొకనాడుఆరాజు దగ్గిరికి నారద మహా ముని వచ్చి రాజునుఆశీర్వదించిఅతడుచేసే అన్న దానానికి సంతోషించి యీ బ్రాహ్మణభోజనం చేయించడానకు మంటికుండలైతే పరిశుద్ధి మట్టు -

యిసుకకుండలై లేబహుపరిశుద్ధిగానుండునని చెప్పి రాజుచేత యథోచిత పూజలంది స్వేచ్ఛా విహారముగా పోయెను - తర్వాత రాజు మంటికుండలుతీసి పారవేయించి యిసుకతోనే కుండలు చేయించి వాటితోనేవంట చెయ్య మనివుత్తర్వు చేసెను - పనివాండ్లున్ను ఆప్రకారమే చేసిరి - అతనిమాహాత్మ్యమువల్ల యిసుకకుండలు విరిసిపోకుండా వుండెను పిమ్మట మరి కొన్ని దినములకు నారదుడు తిరుగాసత్యలోకము నుంచిఅదోవనువచ్చి రాజునుచూచిఆయిసుక కుండలున్నుచూచివోరాజాయిటువంటిపని యిదివరకు యెవరున్ను చేయగా చూడనున్ను లేదువిననున్ను లేమఅని చెప్ప గారాజువినియిది నేను చేసినధర్మంవల్ల విఘ్నంలేకుండా జరుగుతున్నది - మరి వొకదాని నుంచికాదు అనిచెప్పెను - అప్పుడుతాను చేశినధర్మంతాను పొగుడుకొన్నందున యిసుకకుండలన్నిన్ని విచ్చిపోయెను - అదిఅట్లావుండనీ - విక్రమార్కుని గుణాలు చెప్పు తానువిను - ఆప్తుడువచ్చి నట్టయితే వెయ్యి వరహాలున్ను - స్తోత్రము చేసిన వానికి పదివేలవరహాలున్ను విద్యలలోపరీక్ష యిచ్చి మెప్పించినవానికి లక్షవరహాలున్ను విక్రమార్కుడుయిచ్చును - యిట్లావుండగా వొకనాడు వకవిద్యావంతుడువచ్చి రాజునుచూచి బహుప్రకారములుగాస్తోత్రము చేసెను నీవెవరని రాజుఅడిగెను - నేనుచిన్ననాటిస్నేహితుణ్ని ఆరుఅక్షరాల పేరుగలవాణ్ని ఆ పేరుయెట్లాగంటే చెప్పు తానువిను - చతురంగతజ్ఞుడను - మొదటిఅక్షరమువిడిచితే - తురంగతజ్ఞుడను - రెండుఅక్షరాలు విడిచితే - రంగతజ్ఞుడను - మూడుఅక్షరాలు విడిచితే - గతజ్ఞుడను - నాలుగుఅక్షరాలువిడిచితే - తజ్ఞుడను - అయిదు అక్షరాలు విడిచితే - జ్ఞుడను - యీ విద్యలలో పరీక్షపుచ్చుకొమ్మని చెప్పి పరీక్ష యిచ్చి రాజును మెప్పించెను -

అప్పుడు రాజు తనకు ఆవిద్యా వంతుడు, ఆప్తుడైనందువల్లనున్ను స్తోత్ర
ము చేసినందువల్ల నున్ను - విద్యలలో పరీక్ష యిచ్చి మెప్పించినందు వల్లను
న్ను లక్షాపదకొండువేల వరహాలు యిచ్చి పంపించెను - అటువంటి విత
రణగుణము నీకున్నట్టైతే నీవు యీసింహాసన మెక్కు మనగా నాటికి పో
యిరువదియొక నాటికి శుభలగ్నమునందు సింహాసనమెక్క వచ్చెను - అ
ప్పుడు రెండో సోపానమందుండే ప్రతిమ యిట్లనియె.

వినుమో భోజరాజా విక్రమార్కునికి గల సాహస వితరణాది గుణ
ములు నీకు లేవు కాబట్టి నీవీ సింహాసనము యెక్క వద్దు నిలువు మనగా మీరా
జుగుణము లెటువంటివి అని అడిగెను - ప్రతిమ యిట్లనియె - విక్రమా
ర్కుడు రాజ్యము చేశే కాలములో వేగులవాండ్లు విక్రమార్కుని వద్దికి వ
చ్చి అయ్యా చిత్రకూటపర్వతము దగ్గర మంగళగుడిముందర వక బ్రాహ్మణు
డు హోమము చేస్తున్నాడు యిదివరకు యెన్నాళ్లనుంచి చేస్తున్నాడో యెందుని
మిత్తము చేస్తున్నాడో తెలియదు ఆ హోమము చేసిన బూడిదె చూస్తే పర్వత
ము పాటుగున్నది అని చెప్పగా విని విక్రమార్కుడు ఆక్షణం వేగులవాండ్ల
ను వెంటబెట్టుకొని చిత్రకూటపర్వతానికి పోయి - నదిలో స్నానము చేసి ఆను
ష్ఠానమాచరించి హోమము చేశే బ్రాహ్మణుని వద్దికి వచ్చి నీవు యేమికోరి
హోమం చేస్తున్నావు యెంత కాలమాయెను అని బ్రాహ్మణ్ని అడిగెను - ఆ
బ్రాహ్మణుడు - ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధికి కోరి వెయ్యేండ్లనుంచి హో
మము చేస్తున్నాను మంగళ ప్రసన్నమై కోరిన వరమివ్వ లేదని రాజుతో
చెప్పెను - అప్పుడు విక్రమార్కుడు బ్రాహ్మణుని నిమిత్తం అతడు చేశే
పని తాను పూనుకొని అతడు చెప్పే మంత్రాలు తాను చెప్పి హోమము చే
యగా మంగళ అప్పటికిన్ని ప్రత్యక్షము కాక పోయెను - తర్వాత తన శిర
స్సు అయినా కోశి హోమము చేతామని యెంచుకొని తన చేతిఖడ్గముతో శిర

స్సు తెగగోసుకో బోయ్యే సమయాన దుర్గ ప్రత్యక్షమై వద్దు వద్దు రాజా నీ సాహసానికి మెచ్చితినని అతని చేతులు గట్టిగా బట్టుకొని శిరస్సు ఖండించుకోకుండా చేసి నీకు యేమి వరము కావలెనో యిస్తాను అడుగుమనెను - అప్పుడు విక్రమార్కుడు దుర్గం జూచి యీ బ్రాహ్మణుడు బహుదినములమంచి నిన్ను గూర్చి హోమము చేస్తున్నాడే అతనికి యెందుకు ప్రత్యక్షం కాక పోయినావు అని అడగగా అతడు చపలచిత్తుడు కాబట్టి ప్రత్యక్షము కాలేదని రాజుతో దుర్గ చెప్పెను - అయితే నాకు యివ్వవచ్చిన వరము యీ బ్రాహ్మణునికి యివ్వవలశినదని దుర్గతో చెప్పి బ్రాహ్మణుడు కోరిన వరము లన్నిన్ని యిప్పించి అతడి చేత సెలవు తీసుకొని విక్రమార్కుడు తన పట్నానకు వచ్చెను - యిటువంటి గుణాలు నీకు కలవా అని ప్రతిమ అడిగేటప్పటికి లగ్నము మించిపోయెను గనక భోజరాజు తన యింటికి పోయెను.

మూడో సారి మంచిలగ్నము విచారించుకొని సింహాసనము యెక్క వచ్చే భోజరాజును చూచి మూడో సోపానమందుండే ప్రతిమ విక్రమార్కునికి గలిగిన సాహసవితరణాది గుణములు నీకు లేవు అటువంటి గుణములు కలవారే కాని యీ సింహాసనము యెక్క కూడదు - నిలువుమనగా నీ రాజు గుణము లెటువంటివో చెప్పుమని భోజరాజడిగిన ప్రతిమ యిట్లనియె.

మా రాజుకు దైవసహాయమున్ను కలదు దైవసహాయము గలవారికి అసాధ్యమైన పని లేదు - తొల్లి గాళికుడనే రాజు దైవసహాయము చేతను శత్రు రాజులనందరినిన్ని జయించి రాజ్యము చేయలేదా అది యేలాగంటే - ప్రతాపనిధి యనే పట్నముకద్దు - అందు బృహత్సేనుడనే రాజు రాజ్య

పరిపాలన చేస్తూవుండెను ఆరాజుకు సులోచన అనే కొమారితె కలదు.
ఆచిన్నదాన్ని బహుగారాబముతో పెంచియీడు రాగానే పెండ్లి ప్ర
యత్నములు చేసిరితాను యెవ్వరినీ పెండ్లి చేసుకోనేది లేదు శ్రీకృష్ణుడు
నాకు భర్తగావలెనని చిన్నది తండ్రితో చెప్పి శ్రీకృష్ణస్వామిని యెల్లప్పు
డున్ను ధ్యానము చేస్తూవుండెను - ఆవర్తమానము గాలి వినగానే రాజు
వినివక కంసాలవానితో స్నేహము చేసుకొని శ్రీకృష్ణునికి వుండే శంఖ
చక్రాలు మొదలయిన విన్నికీలు గరుడ వాహనమున్ను చేయించుకొని ఆ
శంఖచక్రాదులు ధరించి గరుడవాహన మెక్కి సులోచన యుండే మేడమీ
దవచ్చి వాలెను - అప్పుడతణ్ని ఆమె చూచి సాక్షాత్తు శ్రీకృష్ణస్వామి
వారు తనభక్తికి మెచ్చి తనకు ప్రత్యక్షమయిరి గదా అని తనతల్లినిన్ని తం
డ్రిన్ని - అక్కడికి పిలిపించుకొని ఆకపటకృష్ణునికి సకలోపచారము
లున్ను చేశి తనకు యిష్టార్థసిద్ధి ఆయెనని సంతోషించి అతణ్ని పెండ్లాడి
సుఖముగానుండెను - తర్వాత పరరాజులలో కొందరు యీబృహత్సేను
నికి శ్రీకృష్ణుడు అల్లుడైనాడు కాబట్టి మనము మునపటివలె అలక్ష్యముగా
వుండ గూడదు అని - వెరచి యాటాయాటా పన్ను తెచ్చి యివ్వసాగిరి -
కొందరు మనము భయపడవలశినదేమి గనక బృహత్సేనుని మీదికి దండె
త్తిపోదాము శ్రీకృష్ణుని చేత యుద్ధములో చంపబడ్డట్టయితే వైకుంఠము
కద్దు దానికి సంశయము లేదని - యెంచి మహాధైర్యమున తమ సేనలతో
గూడుకొని బృహత్సేనుని పట్నంమీదికి యుద్ధసన్నద్ధులై వచ్చి కోట ము
ట్టడి వేశిరి - అప్పుడు బృహత్సేనుడు తన అల్లుడైన కపటకృష్ణుని వద్దకి
పోయి, స్వామి హా భావా నేను నీపాదారవిందములే నమ్మి వున్నాను యి
ట్లా వుండగా నన్ను శత్రువులు బాధించవచ్చినారు నమ్మినవాణ్ని కాపా
డవలెను అని - బహుదీనుడై స్తోత్రము చేయగా మంచిది నీవు పోయియుం

ట్లో వుండు యిదిగో నేనుయీక్షణం పోయిశత్రు సంహారముచేశివస్తున్నా
నని చెప్పి అతడుశంఖచక్రాదులుధరించి గరుడవాహన మెక్కి సులోచన
నుతాను వచ్చే వఱ్టు కుయింట్లో నేవుండుమని ఆకాశమార్గాన పోయిశ
త్రువులను చూచిదిగులుపడి - నేనుయీవేషం వేసుకొనియీస్త్రీకోస
వేళవచ్చి తినివస్తి బోదీన్ని తీసుకొని నాడు నా డేలేది నాచోవను నేనుయే
లపోక పోతిని మోసము వచ్చె నుయికనేమిచేతును శ్రీకృష్ణా నీవేగతి
అని - కృష్ణునిధ్యానముచేసెను - అప్పుడుశ్రీకృష్ణస్వామి వానికిప్ర
త్యక్షమై - మంచిది భూడియవద్దుఅని ఆశత్రువులనందరి నిన్నీతనచేతిచ
క్రముచేత సంహరించి - నీకు కావలశినప్పుడునన్ను తలుచుకొంటే నేను
వచ్చి నీకోరికె నెరవేరుస్తున్నా నని చెప్పి అంతర్హితుడై పోయెను - త
ర్వాత యీగొల్లకుండు యింటికివచ్చెను - అతనిభార్యా నున్న అత్తా
మామాలందరున్న చూచిఅతణ్ణి తమపాలిటిదైవమనిప్రార్థించిరి - అ
దిఅటుండనీ మారాజుఅశ్వమేధయాగము చెయ్యవలెనని యత్నము చేసి
ఆసమాచారముదిక్కుదిక్కులకున్న అంపించగా ఆయా దేశపు రాజులు
నానావిధములైన కానుకలు తీసుకొనివచ్చిరి - తర్వాత సముద్రునివద్దికి
తనపురోహితుణ్ణి అంపెను - సముద్రుడున్న పురోహితుణ్ణి చూచి -
రాజుసమాచారము పంపించినప్పుడుఅగత్యము రావలశినదేఅయితే నేను
మేరతప్పి రారాదు గనక కానుకమాత్రమిస్తున్నా ను నేనువచ్చి నట్టే
యెంచుకొండిఅని - నాలుగురత్నాలు అతనిదగ్గిరయిచ్చి - యీరత్నము
సేనను కూర్చును యీరత్నము వస్త్రములుసొమ్ములుమొదలయినఅలం
కారములను కూర్చును యీరత్నముయెంతమందికైనావడ్డిపోసేతము
గాభోజనముపెట్టు నుయీరత్నము ధనము కూర్చును అని - నాలుగుర
త్నాలమహిమా నున్న చెప్పి అంపించెను - తర్వాత బ్రాహ్మణుడుయీ

వృత్తాంతమంతావిక్రమార్కునితో చెప్పి రత్నములుయివ్వగానేవిక్ర
మార్కుడు సంతోషపడి యిందులో నీకుకావలశిన రత్నము వొకటియెత్తు
కొమ్మని బ్రాహ్మణుడితో చెప్పెను-అబ్రాహ్మణుడుయింటికిపోయిఆలోచ
న చేసుకొనివచ్చి యేరత్నముకావలెనో చెప్పు తానుఅనితన యింటికి వచ్చి
యీసమాచారము కొడుకుతోనున్ను కోడలితో నున్ను భార్యతో నున్ను
చెప్పెను - కొడుకు సేననుగూర్చే రత్నము తీసుకొమ్మని చెప్పెను - కో
డలువస్త్రములు సొమ్ములు మొదలయిన అలంకారములు గూర్చే రత్నము
తీసుకొమ్మని చెప్పెను - భార్య షడ్రసోపేతముగా యెంతమందికైనా
భోజనము పెట్టే రత్నము తీసుకొమ్మని చెప్పెను - ఆబ్రాహ్మణునికి ధన
ము గూర్చే రత్నము తీసుకోవలెనని ఆశ గద్దు - పిమ్మట ఆపురోహితుడు
రాజువద్దికి వచ్చి తన కోడలియొక్కా నున్ను కొడుకుయొక్కా నున్ను భా
ర్య యొక్కా నున్ను అభిప్రాయములు రాజుతో చెప్పి ధనము గూర్చే ర
త్నము యిమ్మని రాజును అడిగెను - అప్పుడు రాజు నవ్వి ఆనాలుగు రత్నా
లున్ను నలుగురికిన్ని యిచ్చెను - కాబట్టి యిటువంటి గుణాలు నీయందు
లేవు పొమ్మనెను - అంతట భోజరాజు ముహూర్తం మించిపోయెను గనక
యింటికిపోయెను.

నాలుగో సారి శుభలగ్నము విచారించుకొని సింహాసన మెక్కవచ్చే
భోజరాజును చూచి నాలుగో సోపానము నందుండే ప్రతిమ యిట్లనియెను -వి
క్రమార్కునికి గలిగిన సాహస వితరణాది గుణాలు నీకుగలిగి వుంటేకదా
యీసింహాసనము యెక్కవచ్చును మారాజు గుణము లెటువంటివంటే -
ఉజ్జయినీపట్టణములో విలోచనుండనే బ్రాహ్మణుడుకలడు అతనికి బిడ్డలు
లేక యీశ్వరుణ్ని ఆరాధించి వరము వడసి వక కొమారుణ్ని గనుక్కొనె
ను - అతనికి దేవదత్తుడని పేరు బెట్టెను వేదశాస్త్రములు మొదలయినవిద్య

లంతాచెప్పెను - అటుతర్వాత వకనాడు దేవపూజకు పూలుకోసుకొని
సమిధలు విరుచుకవత్తామని దేవదత్తుడుదూరానవుండే అడివికిపోయెను -
ఆదినము విక్రమార్కుడు వేటాడవచ్చి మృగములను తరుముకొని సేనల
ను వెనక విడిచి బహుదూరము పోయితర్వాత యెండచేత డస్సి దాహము
గొని దేవదత్తుని సమీపానికి వచ్చెను- అప్పుడు దేవదత్తుడు రాజుకు దాహ
ముదీరేటట్టుగామంచినీళ్లున్ను ఆకలితీరేటట్టు గాపండ్లున్ను తెచ్చి యి
చ్చి గుర్రాన్ని చేతపట్టి తీసుకపోయిమార్గములో విడిచిపెట్టెను - త
ర్వాత విక్రమార్కుడు చాలాసంతోషించి యింటికి పోయి దేవదత్తుణ్ని పి
లిపించి వకగ్రామమిచ్చి యింకా ముందర ఉపకారముచేస్తానుపొమ్మనె
ను - మరికొంత కాలానకు దేవదత్తుడు- రాజుముందర చేస్తానన్న ఉపకా
రంచూతామని - పరీక్షార్థముగా ఆపట్నంలో వక రాచకొమారుణ్ని
కానకుండాయెత్తుకవచ్చి దాచి రాచకొమారుడిసొమ్ములుఅంగట్లో పెట్టి
అమ్ముతూవుండెను - ఆసమయాన తలారులు పోబడిబట్టుకొని వెతుక్కొం
టూవచ్చి ఆసొమ్ములుచూచి ఆసొమ్ములతోకూడా దేవదత్తుణ్ని పట్టుకొని
కట్టికొంచపోయి దొంగచిక్కెనని విక్రమార్కునిదగ్గర విడిచిరి - అప్పుడం
రాజు దేవదత్తుణ్ని చూచియిటువంటిపనియేలచేస్తివని కట్లు విడిపించినీకు
శానాప్రత్యుపకారము చెయ్యవలెనని వుంటినియీసొమ్ముకోసరంరాచకొ
మారుణ్ని చంపితివి యీనేరం మన్నించితినిపొమ్మనగాదేవదత్తుడు యిం
టికిపోయి ఆరాచకొమారుణ్ని యెత్తుకవచ్చి రాజు సముఖాన వుంచి మీ
రుమునుపు యింకాబహుప్రత్యుపకారముచేస్తామని చెప్పివుంటిరేఆమా
టమీరు మరిచినారో యేమోచూతామని చేయరానితప్పు చేశిన వాణ్ని
గావుంటినిఅనిచెప్పగారాజునవ్వి అతనికి యింకా కోరిన ధనమంతాయి
చ్చి సంతోషపరిచి అంపించెను కాబట్టి అటువంటి గుణములు నీకు లేవుగిరి

గీష్మాన్మనగా ఆలగ్నము మించి పోయెను గనక నాటికి భోజ రాజు యింటికి పోయెను.

అయిదో సారి కిరుగా మంచి ముహూర్తము విచారించుకొని సింహాసనము యెక్క సోగా అయిదో సోపానమునందుండే ప్రతిమ భోజరాజును చూచి విక్రమార్కునికిగల ఔదార్యాది గుణములు వుంటేనే ఈ సింహాసన మెక్కవలెను లేకుంటే యెక్కగూడదు ఆయన గుణము లెటువంటి వంటివా చెప్పతాను వినుమని యిట్లనియె - ఫ్రైకినాడు విక్రమార్క మహారాజు కొలువై యుండగా రత్నాకరుడనే వర్తకుడు పదిరత్నాలు తెచ్చి రాజు చేత యిచ్చి యివి మీరు పుచ్చుకొంటారా అని అడిగినంతట వాటి వెల యేమని రాజు వాణ్ని అడిగెను - వాడు రత్నాల వెల బాగా తెలియక పదిరత్నాలున్ను లక్షవరాలని చెప్పెను - అప్పుడు రాజు రత్నముల పరీక్ష బాగా గుర్తెరిగిన వాడు గనక యీ వర్తకుడు వీటి వెల బాగా తెలియక చెప్పినాడు వీణ్ని మనము అన్యాయము చెయ్యరాదని వాటి చేసు వెల పదిరత్నాలకున్ను పదిలక్షలవరాలు యిచ్చెను - ఆవర్తకుడు నిండా సంతోషపడి మరిన్ని తనవద్ద ఫ్రైకరత్నము వుండగా అది రాజుకు కొసురుగా యిచ్చెను - దాన్ని రాజు తీసుకొని దానికిన్ని కలిగిన వెల యిచ్చి యీ రత్నమువంటి రత్నాలు యింకా నీదగ్గర వుంటే మాకు పదిరత్నాలు కావలెను యిమ్మని చెప్పెను - యిక్కడ లేవు తమ వూళ్లో తమ యింట్లో వున్నవి యిక్కడికి తమ వూరు యెనభై ఆమడ వున్నది తనతో కూడా ఒక మనిషిని అపించినట్టైతే ఆ పదిరత్నాలున్ను యిచ్చి అంపిస్తున్నానని వర్తకుడు చెప్పెను - అంతట రాజు ఆపదిరత్నాలకు కలిగిన వెల ముందుగా వర్తకుడికి యిచ్చి తనదగ్గర వుండే అసహాయ శూరుడనే పేరుగల బంటును పిలిచి యీ వర్తకునితో కూడా నీవు పోయి యితడు యిచ్చిన రత్నాలు నీవు తీ

సుక రావలశినది యితనివూరు ఫలానిది ఎన్నాళ్లకుపోయి రాగలవుఅని అడిగెను - వాడుయిన్ని దినాలకువస్తానని గడువు చెప్పెను - ఆగడువు ప్రకారం రాకపోయినట్టాయెనా నిన్ను మన్నించనని చెప్పి రాజువాణ్ని అంపించెను. వాడు ఆవర్తకునితోకూడా పోయిఅతడుయిచ్చినరత్నాలుతీసుకొని తిరుగా రాజువద్దికివస్తూవుండగా దోవలో వర్షాలచేత వకయేరు రానివ్వకపోయెను - ఆయేటివద్దికివచ్చే వరకు సాయంకాలమయినది - అక్కడపడవ వాణ్ని పిలిస్తే నేనుయీవేళిప్పుడు రాను ఉదయాన్నైన వెనకవస్తానని చెప్పెను - ఆదినము రాత్రి రాజుదగ్గిరికిచేరకపోతే గడువుతప్పుతుందిఅక్కడికి రాజుఖండేపట్నంరెండామడ వున్నది - కాబట్టి ఆఅసహాయ శూరుడు నిండావిచారగ్రస్తుడై తిరుగా పడవవాణ్ని పిలిచినేను విక్రమార్క మహారాజువద్దికిపోవలశినవాణ్ని ఫలానివ్వాళ్లో వుండే ఫలాని వర్తకునిదగ్గిరనుంచిరత్నాలుతీసుకపోతున్నాను నేడు రాజుదగ్గిరయీరత్నాలుయివ్వకపోయినట్టైతే నాకు దండన వచ్చును కాబట్టి పడవవెయ్యమనిచెప్పెను - విక్రమార్క మహారాజు అయితే నేమి నాకు భయమా నీకుదండనవస్తే నాకుయేమైనా విచారమా నీవురత్నాలుకొంచపోగానేనావల్లో యేమైనా పడుతున్నదా నేనుయిప్పుడుపడవవేశేది లేదు పొమ్మనిపడవ వాడు చెప్పెను - అప్పుడీబంటు వకవరహా యిస్తాను యేరుదాటించుము నేను ఆపదిరత్నాలలో అయిదురత్నాలుయిస్తే యేరుయిప్పుడు దాటిస్తానని పడవ వాడు చెప్పెను - మంచిది రత్నాలుయిస్తే యెక్కడబోయ్యాయి యిప్పుడు మనకార్యము గడవడం గొప్ప అని మెంచి అట్లాగే వాడు అడిగిన ప్రకారం అయిదు రత్నాలు వున్న వాడికిమనసు వచ్చినదిగా యిచ్చి పడవమీదయెక్కి యేరుదాటి ఆ రాత్రే రాజుదగ్గిరికివచ్చి అయ్యా నేను వచ్చినానని సమాచారము తెలియచేశెను - మంచిది యీరాత్రి నీవు యింటికిపోయి రేపు ఉదయాన

రమ్మని ఆరాజు ఆజ్ఞాపించెను ఆప్రకారం మనాఁడు ఉదయాన ఆబంటు రాజు సముఖానకు వచ్చి ఆ అయిదు రత్నాలను రాజు ముందర వుంచి తాను పడవవాడికి అయిదు రత్నాలు యిచ్చి యేరు దాటివచ్చిన సంగతి చెప్పుతూ వుండగా ఆపడవ వాడున్ను వచ్చి తాను తీసుకొన్న రత్నాలు అయిదున్ను రాజు సముఖాన వుంచి మీ బంట్రౌతు యొక్క గుణం కండా మని రత్నాలు తీసుకొంటిని మీ సొమ్ము మీకు చేరెను అపరాధము క్షమించవలెను అనగా రాజు నవ్వి మా బంట్రౌతు యిచ్చినది మేము యిచ్చినట్టే నని వానికి ఆ అయిదు రత్నాలున్ను తిరుగా యిచ్చి ఆజ్ఞకు వెరచి వచ్చిన అసహాయ శూరుణ్ని మెచ్చుకొని కడమ అయిదు రత్నాలున్ను అతనికి యిచ్చి యింకా వేరే బహుమానమున్ను చేసి అంపించెను - యిటువంటి గుణములు నీకు వున్నట్టయితే యీ సింహాసన మెక్క వచ్చునని చెప్పగా యింతలో తాను నిశ్చయించుకొన్న ముహూర్తము మించిపోయెను గనక భోజరాజు యింటికి పోయెను.

ఆరో సారి మంచి లగ్నము విచారించుకొని సింహాసన మెక్కవచ్చే భోజరాజును చూచి ఆరో ప్రతిమ యిట్లనియె - ఓ రాజా నీవైతే బహు త్వరగా సింహాసన మెక్క వస్తున్నావు విక్రమార్కునికి గల సాహసాది గుణములు కలవారే కాని యితరులు యీ సింహాసన మెక్కేటందుకు అర్హులు గారు - నీకు ఆ గుణములున్నట్టయితే యీ సింహాసన మెక్క వచ్చును ఆయన గుణములు యెటువంటివని అడిగితే చెప్పుచున్నాను విను - ఒక నాడు విక్రమార్కుఁడు ముకుంద వనము సేవనానికి సపరివారముగా పోయి విలాసముగా సంచరిస్తూ వుండే సమయములో వొక ముసలి బ్రాహ్మణుడు వచ్చి వోయి మహారాజా నేను అనేక సంవత్సరములు దుర్గను గురించి తపస్సు చేస్తిని తర్వాత దుర్గ నాకు ప్రత్యక్షమై యిక్కడికి కొన్ని దినములకు వెనకను విక్ర

మార్క డనేరాజు గాబోతున్నాడు అతణ్ని అడిగితివంటే నీవుకోరిన కో
ర్కెలు నెరవేర్చు నని చెప్పె నుకాబట్టి మీరాకనిరీక్షిస్తూ వున్నా ను నా
భాగ్య వశమువల్ల నేటిదినంయిక్క డికివచ్చితిరిఅని - చెప్ప గా రాజువిని
మంచిది నీకుయేమి కావలెనో కోరుమనెను. యీవనానకుసమీపముగా
చండి కాపురమనేపట్టణముగట్టించిఆపట్టణానికి నన్నురాజును చేసి కొంత
రాజ్య మునాకింద వుండేలాగున చేయించవలెనని బ్రాహ్మణుడు కోరె
ను - విక్రమార్కుడు అతనికోరికె నెరవేర్చేటందుకు తాను నెల దినము
లుఅక్కడవుండి వెక్క పట్టణముగట్టించిచండికా పురమని పేరు బెట్టి ఆప
ట్టణానికి అతణ్ని అభిషిక్తుణ్ని చేసిచతురంగబలములు అమర్చి బొక్క
సానికి నాలుగు కోట్ల ధనముయిచ్చి కొంత రాజ్యమున్ను అతనిఆధీనము
చేసిసుఖముగా రాజ్యము చేస్తూవుండుమని చెప్పి ఆబ్రాహ్మణునికిన్ని అ
తనిభార్య కున్ను సకలాభరణములిచ్చి తననగరానికి తానువచ్చెను -
యిటువంటి గుణాలు నీకు లేవు గనక పొమ్మనెను నాటికిభోజరాజు తిరిగియిం
టికిపోయెను.

యేడో సారి భోజరాజు యెప్పటియట్ల శుభలగ్నము విచారించు కొని
సింహాసన మెక్క వచ్చే సమయమునందు యేడో ప్రతిమఅతణ్ని చూచి యి
ట్లనియె - వోయిరాజా విక్రమార్క మహారాజు గారి సాహసాది గు
ణములుగలవాడవైతివా యీసింహాసన మెక్క వచ్చును లేకుంటే యెక్క
రాదు ఆయనగుణము లెటువంటి వంటేవినుము - ఉజ్జయినీపట్టణములో
ధనదుడనే కోమిటిగలడు వాడుబహు ధనము సంపాదించిధర్మము చేయవ
లెననే తలంపు గలవాడై ధర్మకథలు వినుచున్న యథావిధిగా సమస్త దా
నములు చేస్తున్నసమస్తతీర్థముల యందు స్నానముచేసేటందు కోసరము
తీర్థయాత్ర బైలువెళ్లి మార్గముబట్టి పోతున్నమార్గములో నెక భైర

వునిగుడి చూచిఅక్కడగుడి సమీపమున నొక కొలను వుండగా దాంట్లో
స్నానముచేసి ఆగుళ్లోకి వచ్చి భైరవునిదర్శనము చేసుకొని అక్కడనొ
కశాసనము చూచెను - యెవ్వడైనాయీగుళ్లో తన తల తానే తెంచు
కొంటే యీగుడిముందర పడివుండే స్త్రీపురుషులయొక్క రెండుమొండె
ములున్న వేరవేరేవుండే తమతలలతో గూడుకొని జీవించును అనిఆ శా
సనములో వ్రాశివుండెను - అదిఆకోమిటి వాడు చదువుకొని గుడివెడలి
వచ్చి గుడిముందర మొండేలున్న చూచిఆశ్చర్య పడిఅక్కడనుండ వెరచి
అవతలపోయి అనేకదానములు చేసితర్వాతసకలతీర్థములు సేవించు
కొనితిరుగా ఉజ్జయినీనగరమునకు వచ్చి యీదోవలో భైరవుని గుళ్లో
వ్రాశివుండిన శాసనపు సంగతి యావత్తున్ను విక్రమార్కునితో చెప్ప
గాఆవింత చూచివత్తామని విక్రమార్కుడు తనపట్టణము బైలుదేలిపోయి
ఆభైరవునిగుడివద్దిగుంటలో స్నానముచేసి గుడిముందరికి వచ్చి అక్కడప
డివుండే మొండేలున్న తలకాయ లున్న చూచిగుళ్లోకిపోయి ఆశాసన
ముచదువుకొని పైకరికి ఉపకారము చేయని శరీరమెందు కని తనచేతిఖడ్గ
ముచేత తనకంఠము తెగవేసుకో బొయ్యే సమయాన రాజు సాహసానికి
మెచ్చి భైరవుడు ప్రత్యక్షమై రాజుచెయ్యి పట్టుకొనినీకు వరముయిస్తా
నుఅడుగుమనెను - యీనీగుడి ముందర పడివుండే మొండెములను బ్రతి
కించవలశినది యిదేనాకు కావలశిన వరమునాకువేరే కోరిక లేదని భైర
వునితో రాజుచెప్పెను - అతనిపరోపకారబుద్ధికి భైరవుడు నిండాసంతు
ష్టుడై ఆమొండేలను బ్రతికించెను అప్పుడురాజు మహాసంతోషపడి ఆదే
వునికిప్రదక్షిణనమస్కారములు చేసిస్వామీనాపూర్వజన్మకృత పుణ్య
మువల్ల మీరుప్రత్యక్షమయితిరి నేనొకటిఅడుగుతున్నాను - యీ స్త్రీ
పురుషులు యెవరు యేమికారణముగా యిట్లామొండేలయిపడివున్నారు

యిప్పుడువీరుబ్రతకడమేమి యీసంగతి యావత్తున్ను నాకుదయ చేసిచెప్పవలెను - అని భైరవుణ్ని అడగగా భైరవుండిట్లనియె.

రత్నోద్భవుడనేకోమిటి శెట్టి గలడు అతడువాడ బేరము పోవలెనని తన చుట్టాలతోగూడా ప్రయాణమై పోతూ మార్గములో వుండే యీ గుడిదగ్గిరదిగినాడుఆసమయాన మరియొకకోమిటి శెట్టి వచ్చి వారువుండే దిక్కుననిలిచి వుండగారత్నోద్భవుడు చూచి ఆకోమిటిని కూర్చుండుమని మీరు యేదేశాననుండి వస్తున్నారుయెక్కడికిపోతున్నారుమీదే వూరుమీపేరేమి అనిఅడిగెను - నేను మగధ దేశాన్నుంచివస్తున్నాను రత్నద్వీపానకు పోతున్నాను - మావూరు సుధాకరమనేపేరుగలది నాపేరుచంద్రకేతుడు అనిరత్నోద్భవునితో ఆకోమిటివాడు చెప్పెనుఅక్కడికియేమినిమిత్తముపోతున్నావనిఅడిగెను - ఆరత్నద్వీపములోనొక కోమిటివారియింటపద్మావతిఅనేకన్యకవున్నదిఅదిబహుచక్కనిదని నేను విని దాన్ని పెండ్లి చేసుకొందామనిపోతున్నాను నేనుత్వరగా పోవలెను - అనిచంద్రకేతుడులేచిప్రయాణముకాగారత్నోద్భవుడుఆమాటలు విని ఆపడుచుపైనభ్రాంతిపడి నీవుయెందుకు పోతావుఆచిన్నదాన్నినాకువివాహము చేశియిస్తామని దానితల్లిదండ్రులుసమ్మతించిమాటయిచ్చి వున్నారుయెల్లుండిముహూర్తమనిజాబున్నువ్రాశిఅంపించినారుకాబట్టి నేను మాచుట్టాలనందరినిన్నీ వెంటబెట్టుకొనిపోతున్నాను నీవు తిరిగి మీవూరికిపొమ్మనిచంద్రకేతునితో చెప్పెను - అంతట - నేనుచేశినప్రయత్నానకుయిట్లా అడ్డంకిమాటలు చెప్పి నడమంత్రానవిఘ్నము చెయ్య వచ్చినావాఅనిరత్నోద్భవుణ్ని కోపించుకొనిఅతడురత్నద్వీపానకు పోయెను - తర్వాత రత్నోద్భవుడు యీగుడి ముందర నిలిచి వోభైరవమూర్తీఆకన్యకనాకు చేకూడివివాహమైనట్టయితే నేను పెండ్లి చేసుకొన్నప

దిహేను దినములకునాతలనీకుబలియిస్తున్నానుఅనినన్నుప్రార్థన చేశి
తానున్ను త్వరగారత్న ద్వీపానకు పోయెను-పిమ్మట వారిద్దరున్ను పండ్లువ
సుపుపట్టించుకొని మామగారి యింటికి ఏకకాల మునందు పోయిరి అత్తడు
వారిని చూచివారు యిద్దరు తెచ్చి నదితీసుకొని వారి వర్తమానముఅడు
గుతూవుండే యెడల వొక జంగము వాడుకొన్ని సంపెంగ పువ్వులు తెచ్చి
ఆశెట్టికికానుకగాయిచ్చె న్నువాటినిఆశెట్టి తీసుకొని రత్నోద్భవునికిన్ని
చంద్ర కేతునికిన్ని పంచియివ్వగావారలుయిద్దరున్ను తీసుకొనిరి - ఆ
పూలనుచంద్రకేతుడు గొబ్బునశిరస్సునధరించెను - రత్నోద్భవుడు
భగవదర్పితము చేసిఅక్కడవుండే పెద్దలకుకొన్నియిచ్చి తానున్ను కొన్ని
ధరించెను - ఆయిద్దరినిన్ని ఆచిన్న దానితండ్రి చూచియీయిద్దరిలో యె
వరిని పెండ్లాడుతావని కూతురిని అడిగెను - అప్పుడాచిన్న దితండ్రిని
చూచిఅయ్యా యిప్పుడుమీరు యిచ్చి నపుష్పములు చంద్రకేతుడు వూ
రికే ధరించుకొన్నాడు - రత్నోద్భవుడు భగవదర్పితముచేసిపెద్దలకు
న్ను కొన్ని యిచ్చి శేషించినవి తాను ధరించెను - కాబట్టి రత్నోద్భవు
డుసుగుణుడుగానున్ను పది మందిని పోషించగల వాడుగానున్న తోస్తు
న్నది - నేనురత్నోద్భవుణ్ని పెండ్లాడుతానని చెప్పెను - అప్పుడాశె
ట్టి తనకొమార్తె బుద్ధికి మెచ్చి దాన్నిరత్నోద్భవునికి యిచ్చి పెండ్లి చేసె
ను - అటుతర్వాత చంద్రకేతుడు తనకు అవమానము వచ్చెనుగనక శిగ్గు
పడిచిన్న బోయి తనదేశానకు ప్రయాణము కాగా - ఇతడు బహుదూర
మునుంచి మనయింట్లో పడుచువున్నది పెండ్లాడుదామని వచ్చి నాడు ఇత
నికిమనము చిన్నదాన్నియివ్వక అవమానము చేయడముమనకుమంచిదికాదు
అనియోచనచేసిఅతనికిపద్మావతిచెల్లెలిని గుణవతిఅనేదాన్ని యిచ్చి పెండ్లి
చేసెను - చంద్రకేతుడు అత్తమామలచేత శెలవుతీసుకొని ఆగుణవతిని
వెంటబెట్టుకొనితనదేశానికి పోయెను - రత్నోద్భవుడున్నుతనభార్యను

వెంటబెట్టుకొనితన మొక్కు చెల్లించవలెనని యీనాగుడిదగ్గిరికివచ్చి భార్య నిద్రపోతూ వుండగా అప్పుడక్కడనున్న వారితోతాం జేసుకొన్న ప్రార్థననున్ను తానుయిప్పుడు మొక్కు చెల్లించడమునున్ను చెప్పితనతలతానేఖండించుకొనెను - తర్వాత పద్మావతినిద్ర లేచితన మొగుడితలచూచిఅక్కడనున్న వారివల్ల అతడు తలతెంచుకొన్న హేతువు యావత్తున్ను విని దుఃఖించి తిరిగి యింటికి పోతినా పెండ్లి అయినపది హేనోనాటికి వచ్చి పుట్టినిల్లు చేరెను ఇదియెంత నిర్భాగ్యురాలని నిందింతురు అత్తవారింటికి పోదామంటే వారిని యెవ్వరినిన్ని నేను యెరుగను అక్కడికి పోయిన వెనక నీవు యెవరని అడిగితే వారితో నేనేమి చెప్పుదును కాబట్టి యెక్కడికిపోవడమున్ను యుక్తముగాదు నేనున్ను నాపెనిమిటి వలెనే శిరస్సు బలి యిస్తున్నానని తనతలతెంచుకొనిమృతిబొందెను - తర్వాత నేను వానిఆడిబొంకనితనానికిన్ని దానిపాతివ్రత్యానికిన్ని మెచ్చి యీదంపతుల కోసము యెవడైనాతనతల తానే తెగవేసుకొన్నట్టయితే యీదంపతులుతిరుగా జీవింతురు అనిశాసనము వ్రాశిపెట్టినాను - యీసమాచారమునీవు వినివచ్చి వీరిని బ్రతికించినావు అనిరాజుకు అనేకదివ్యాభరణములిచ్చి భైరవుడు సెలవిచ్చి అంపించెను - తర్వాత విక్రమార్కుడు ఆరత్నోద్భవుణ్నిన్ని అతనిభార్యనున్ను తనపట్నానికి వెంటబెట్టుకొని పోయివారికి కొంతధనము యిచ్చి అక్కడనే వుంచుకొని సుఖముగా నడిపిస్తూ వచ్చెను - యిటువంటి సాహసాది గుణములునీకు లేవుగనక యీసింహాసనమునీవు యెక్క గూడదు అని చెప్పగా అంతట భోజరాజు ఆదినము యింటికి పోయెను.

యెనిమిదో సారి భోజరాజు సుముహూర్తము విచారించుకొని సింహాసన మెక్క వచ్చే సమయమునందు యెనిమిదో ప్రతిమయిట్లనియెను భో

జరాజా మా రాజునకు కలిగిన గుణములు లేనివాడయితే యీ సింహాసన మెక్క
గూడదు మా రాజు గుణములు చెప్పు తాను విను - ఒక నాడు మా రాజు మం
త్రి పురోహితులు మొదలుగాగల వారితో ఔట్టు యీ సింహాసనము మీద
నిండుకొలువై యుండగా వేగులవారు నానా సమాచారములున్న తెలు
సుకొని వచ్చి రాజునకు మ్రొక్కి తమరు విన్నకన్న సమాచారములు చె
ప్పే టప్పుడు వేగవంతుడనే వేగులవాడు యిట్లనియె - మాళవ దేశమున
నేకకోమిటి బహుధనవంతుడు వాడు బహుద్రవ్యము వ్రయము చేసి వొ
క చెరువు వేయించి నాడు దానికట్ట యోజనము దూరము దాని లోతు రెం
డు తాళ్ల ప్రమాణము గానికి నీళ్ల వరవలు శానావున్న వి అయినప్పటికిన్ని
యెన్ని వర్షాలు గురిసినా యెన్ని నీళ్లు వచ్చినా వచ్చిన నీళ్లన్ని యింకి పో
వడమే కాని నిలవడము లేదు - యిట్లా వుండగా తాను బహుద్రవ్యము
వ్రయము చేసి కట్టించిన చెరువులో నీళ్లు నిలవక పోవడానకు దుఃఖించుచుం
డే కోమిటి వానికి ఆకాశవాణి యిట్లనియె - ఓయి శెట్టీ నీ వెందుకు విచార
పడుచున్నావు విచార పడవద్దు సాహస వితరణాది సకలగుణ సంపన్నుడై
న వాని యొక్క కంఠరక్తముతో కలిపిన అన్నము యీ చెరువుకు సమీపము
నను ండే దుర్గకు బలియిస్తే యీ చెరువు నీళ్లు యేకాలమున్ను వట్టి పోక
సముద్రము వలెనే వుండును - అనగా ఆ శెట్టి విని యిటువంటి పురుషుణ్ని
నేనెక్కడ తెత్తును యేమి చేతును మంచిది కానీ సర్వే జనాః కాంచన మా
శ్రయంతి అనే న్యాయమున్నది గదా అని యోచించి ముప్పై రెండు కోట్ల
వరహాలు పెట్టి ముప్పై రెండు ప్రతిమలు చేయించి ఆ చెరువు దగ్గిర నుండే
దుర్గ గుడి ముందర పెట్టించి సాహస వితరణాది సకల గుణ సంపన్నుడై
న వాడెవడో వాడు వచ్చి తన కంఠరక్తముతో కలిపిన అన్నము యీ దుర్గ
కు బలియిచ్చి యీ బంగారు ప్రతిమలను తీసుకో వలసినది అని వొక శాసన

ము వ్రాయించి ఆ ప్రతిమలకు ముందుగా పాతించినాడు - అని వేగులవాడు చెప్పగా రాజు విని దిగ్గన లేచి చంద్రాయుధము తీసుకొని ఆ వేగుల వాణ్ని వెంటబెట్టుకొని మాళవ దేశానికి పోయి అవర్తకుడు కట్టించిన చెరువు చూచి అక్కడనుండే దుర్గగుడికి పోయి దుర్గను సేవించి ఆ బంగారు ప్రతిమలను చూచి అక్కడ వుండే శాసనము చదువుకొని యీ చెరువు నిండినట్టయితే అనేక ప్రాణులకు హాయిగా ఉంటును ఇందుకుగాను నాకంఠరక్తము యిస్తే నేమాయెను అని ఆపనికి ఉద్యుక్తుడై చంద్రాయుధము తళుక్కున మెరిపించగానే ఆ దుర్గ ప్రత్యక్షమై అతని చెయి పట్టుకొని నీ సాహసానికి మెచ్చితిని వరమడుగు ఇస్తానని చెప్పెను - ఈ కోమటి శెట్టి తొవ్వించిన చెరువు నిండేటట్టుగా అనుగ్రహించవలశినది యిదే నాకు అభీష్టము ఇంతకంటే వేరే నాకు కోరిక లేదు అని విక్రమార్కుడు చెప్పెను - అప్పుడు దుర్గ యొక్క ప్రసాదమువల్ల వానలు కురిసివచ్చిన నీళ్లంతా చెరువులో నిలిచి చెరువు నిండెను - తర్వాత దుర్గ విక్రమార్కుని చూచి ఓరాయి రాజా నీవు పరోపకారము చేసే స్వభావము గల వాడవు పూర్వము ఈ ప్రకారముగానే ఒక యెలుక తన ప్రాణమునకు తెగించి కప్పలను భక్షించే పాముకు శాపవిమోచనము చేసి కప్పలనున్ను కాపాడెను - అది యెట్లాగంటే చెప్పుతాను విను.

హిమవత్పర్వతము దగ్గర వొక మడుగులో కప్పలు నిండా చేరియుండును - అక్కడికి దినదినమున్ను మూడు తలల పాము ఒకటి వచ్చి ఆ మడుగులో నుండే కప్పలను భక్షించి ఆ మడుగు చుట్టూ మూడు మాట్లు తిరిగి యెవడైనా అదురుగుండే లేని వాఁడు పిరికితనము లేకుండా తన దేహాన్ని నాకు ఆహారముగా యిస్తే యీ కప్పలను తినడము మానుదును అని కూస్తూ తాను ఉండే చోటికి పోతూవచ్చును - ఈ సమాచారము ఒక కాకి విని తనకు స్నేహితుడైన మూషక రాజుతో

చెప్పెను - ఆయెలుక కాకిని వెంటబెట్టుకొని ఆమడుగు దగ్గిరికివచ్చెను - నేటిదినము మూడు తలల పాము వచ్చి యేకప్పలను మింగునో అని కప్పలన్నీ గుంపుగూడి దుఃఖ పడుచుండగా వాటిదుఃఖముయీయెలుక చూచి నిండా దయవచ్చి నేటి దినము ఆపాముకు నేను ఆహారమై నిలిచి కప్పలనుచంపకుండా చెయ్యవలెను నేను ఒకణ్ణి బ్రతికితే నేమి బ్రతకకుంటే నేమి ఇన్ని జంతువులు బ్రతుకుచున్నవి గదా అనియోచన చేసి అపాము వచ్చే మార్గములో యెదురుగా నిలిచెను . ఆసమయాన పామున్ను వచ్చెను యెలుక పామునుచూచి నేనునీకు అహారముగా యెదట నిలిచి యున్నాను నన్ను భక్షించు కప్పలజోలికిపోవద్దు అని చెప్పెను - అప్పుడా పాము ఆ రూపమువిడిచిబ్రాహ్మణరూపము ధరించి వోమూషకరాజా నిన్నుంచినాకు శాప విమోచన మాయెను నీవు యింకొక జన్మమున బ్రాహ్మణుడవై పుట్టుదువు నీవు తొల్లిటి జన్మమునందు దాచినధనము అప్పుడు నీకు అగుపడును ఆధనము పెట్టినీవు మూషకేశ్వరమనే పేరుగల గుడి కట్టింతువు అనిచెప్పగాయెలుక ఆశ్చర్య పడి నీవుయెవరు నీకు యీశాపము యేల వచ్చెను పూర్వ జన్మమున నేదాచినధనము నీకుయెట్లా తెలిసెను - ఇంకొక జన్మమున నేను బ్రాహ్మణుడుగా పుట్టడమున్ను అప్పుడు ఆధనము నాకు దొరకడమున్ను నేను ఆధనము పెట్టి గుడి కట్టించడమున్ను యిది అంతా నీవుయెట్లా తెలుసుకొంటివి నాకు తెలియ జెప్పుమనెను - అప్పుడుశాప విముక్తుడైన బ్రాహ్మణుడు మూషకముతోనిట్లనియె.

పూర్వ జన్మమునందు నేను దీర్ఘతముడనే ఋషికిశిష్యుణ్ణి ఆయన ఒక నాడు నన్ను నిమంత్రణచేసెను - తర్వాత ఆవూరి అధికారి యింట్లో ప్రయోజనము ఆయనకు యెక్కడా బ్రాహ్మణుడు దొరకక ఆదిన మే నన్ను బలవంతముగాని మంత్రణకు ఒప్పుకొమ్మనెను ఆయన మాట వినకపోతే అధికారిగనక దండించీని అనిభయపడి ఒప్పుకొని గురువు యింటికిపో

క ఆయన యింట్లో నేనిలిస్తినిగనక గురువుకు కోపంవచ్చి నీవుయిక మీాస మాయింటికి రావద్దు-ద్రవ్యానికి ఆశించి అధికారియింటికి పోతివి నాదగ్గిరస మస్తమైన విద్యలున్ను చదువుకొని నామాట లక్ష్యము చేయక పోతివి కాబట్టి నీవుమూడుతలల పామువై పుట్టికప్పలను భక్షింతువు గాక అనిగురువు నాకు శాపమిచ్చెను - అప్పుడు నేను మహాదీనుడనై అయ్యా నేను అర్థాపేక్ష చేత పోయినవాడను కాను నాతప్పు క్షమించవలెను - నాకు శాప విమోచనమెన్నటికి అవును నన్ను అనుగ్రహించి చెప్పండి అని నేను వేడుకొనగా గురువు నన్ను చూచి యేజంతువయినా నీయెదురుగా నిలిచి ఆకప్పలను తినవద్దు తన్ను దినుమని చెప్పినట్టయితే అప్పుడునీశాపముతీరి నీవుబ్రాహ్మణుడవౌదువు- నీకుయెదురుగా నిలిచి తన్ను భక్షించుమని చెప్పిన జంతువుబ్రాహ్మణుడై పూర్వ జన్మమున దాచినధనమును పొందిమూషకేశ్వరమనే గుడి కట్టించును అని నాతో చెప్పెను - తర్వాత అదిమొదలుకొని నేనుయిట్లా పాము రూపమెత్తికప్పల తింటూ వుంటిని - నేటికి నిన్నుంచి నాశాపవిమోచనమాయెను నేను యథేచ్ఛగా పోతున్నానని చెప్పి ఆబ్రాహ్మణుడు పోయెను - అంతట ఆయెలుక ఆశరీరం విడిచి బ్రాహ్మణుడై పుట్టితొల్లితాను దాచినధనమును పొంది మూషకేశ్వరమనే గుడికట్టించెను - కాబట్టి ఉపకారము చెయ్యవలెననే తలంపుగలవారు తమ ప్రాణము తృణముగా యెంచుదురు అని దుర్గ చెప్పగా నే రాజు ఆదేవికి ప్రదక్షిణనమస్కారములు చేసి ఆచెరువు కట్టించిన కోమిటినిపిలిపించియీాముప్పైఖరెండు బంగారు ప్రతిమలున్ను నీవశానఉంచుకొనిముప్పైఖరెండు కోట్లవరాలకు గుళ్లున్ను సత్రములున్ను చలివేంద్రలున్ను కట్టించి ధర్మము చెయ్యమని శెలవిచ్చి ఉజ్జయినీ నగరమునకు పోయెను గనక అటువంటి సాహస వితరణాలు నీకు లేవుగనక తిరిగిపొమ్మనగా భోజ రాజు యింటికి పోయెను.

మర్నాడు సుముహూర్తము విచారించుకొని భోజరాజు యెప్పటి వలెనే సింహాసనము యెక్కరాగా తొమ్మిదో సోపానమునందున్న ప్రతిమయిట్లనియె.

ఓ రాజా విక్రమార్కునికి గల గుణాలు నీకు గలిగి యుంటేనే యీ సింహాసన మెక్కవచ్చును - లేకుంటే యెక్కగూడదు ఆయన గుణములు యెటువంటివంటే చెప్పుతాను విను - ఉజ్జయినిలో కమలాకరుండనే వొక బ్రాహ్మణచిన్నవాడు తల్లితండ్రుల మాటవినక చదువు కోకుండా వుండగా తండ్రికి కోపంవచ్చి యిటువంటికొడుకువుంటే నేమి లేకుంటే నేమి యని కొడుకు మీద కోపము చేసితిట్టెను - తర్వాత అందునిమిత్తం ఆకొడుకు అలిగి దేశంమీద పోయెను - కొన్నాళ్లకు అతడు కావేరిగగ్గిర నొక అగ్రహారములో చేరి సుమంత్రుడనే బ్రాహ్మణ్ని ఆశ్రయించి వారికి నిత్యా చెప్పి నపనులు చేస్తున్న వారియింట్లోవుండెను - యిట్లావుండగా కొన్నాళ్లకు వీనిమీద ఆయింటి బ్రాహ్మణునికి దయ వచ్చి చదువు చెప్పించవలెనని తలచెను వీనికి న్ని బుద్ధివచ్చి చదువుకో వలెనని ఆశపుట్టెను - పిమ్మట ఆబ్రాహ్మణుడు అతనికి సకల విద్యలు చెప్పించి ఘట్టవాణ్ని చేశి - మీతల్లితండ్రులను చూచి బహు దినాలు ఆయెను గదా నీవు మీ వూరికిపోయి వారిని చూచి రమ్మని సెలవిచ్చి అంపించెను - అప్పుడు కమలాకరుడు తమవూరికి పోతున్నా మార్గానవుండే సంస్థానములలోకి పోయి అక్కడి రాజులను చూచి వారివద్దతనవిద్య ప్రకటపరిచి వారిచేత బహు మానము లంది కాంచీనగరానకు పోయెను అక్కడ సర్వ తీర్థములలో స్నానము చేసి ఏకాంబ్రేశ్వరుని గుడికిపోయి ఆదేవుని సేవించి తిరుగా వస్తూవుండే సమయములో అక్కడికి వొక వేశ్య వచ్చెను - దాన్ని చూచి ఇతడు మోహించి తన అభి

ప్రాయము దానికి తెలియచేసెను - అప్పుడా వేశ్య యితణ్ని చూచి తన్నొ
క రాక్షసుడు మోహించి యున్నాఁడు నా వద్దికెవరైనా వస్తే వారిని చం
పును కాబట్టి నీవు నాతోకూడా రావద్దు ప్రాణము తప్పించుకొని పొమ్మనె
ను - అంతట అతడు ఉజ్జయినికి వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించి తాను
నేర్చిన విద్యలు చెప్పగా వారు సంతోషించి రాజుదగ్గిరికి కొడుకును పిలు
చుకొని పోయిరి - అప్పుడా విక్రమార్కుడు ఇతణ్ని చూచి యే యే దేశాలు
తిరిగినావు యేమేమి వింతలు చూచినావు యేమేమి నేర్చుకొన్నావని అడ
గగా తాను తిరిగిన దేశాలున్ను తాను చూచిన వింతలున్ను తాను నేర్చు
కొన్న విద్యలున్ను రాజుతో చెప్పి తర్వాత కంచిలో తాను చూచిన వేశ్య
యొక్క వర్తమానమున్ను చెప్పెను అదివిని రాజు ఆశ్చర్యపడి కమలాక
రుణ్ని వెంటబెట్టుకొని కంచికి ప్రవేశించి వేశ్య యింటికి పోయి తన వర్తమా
నము వేశ్యకు తెలుపుమనగా కమలాకరుడు వేశ్యతో చెప్పెను - ఆ వేశ్య
యీ రాజు దగ్గిరికి వచ్చి తన వర్తమానము విశదపరిచెను - అప్పుడా రాజు
దాన్ని చూచి మాకు యెవరినుంచిన్ని మరేమి భయము లేదు మేము మీ యిం
టికి వస్తున్నాము నీవు యింటికి పోయి రాత్రికి సిద్ధముగా నుండుమని ఆజ్ఞా
పించెను - అది మంచిదని ఒప్పుకొని తన యింటికి పోయి సర్వసిద్ధముగా
నుండెను - తర్వాత రాత్రి వేళ రాజు వేశ్య యింటికి పోయి - దాని చేత చే
యబడ్డ ఉపచారముల చేత సంతుష్టుడై వీణా గానము వింటూ వుండే సమ
యాన ఆ వేశ్యను మోహించియున్న రాక్షసుడు వచ్చి నేను వచ్చే యింటికి
యిదివరకు యెంతటివాడున్నూ రా వెరచును నేడు యెవడో వచ్చి యున్నా
డు అని మహా కోపముతో పండ్లు పటపట కొరుకుచున్న రాజు మీదికి వచ్చె
ను - అప్పుడు రాజు తన చేతి చంద్రాయుధము చేత వాని శిరస్సు ఖండించి
చంపెను - ఆ రాక్షస సంహారము చూచి వేశ్య సంతోషపడి నో మహానుభా
వుడా నిన్నుంచి నాకు రాక్షస బాధ తీరెను నన్ను పరిగ్రహించుమనగా ని

న్న నేను పరిగ్రహించను నిన్న కోరిన యీ కమలాకరుని కోరికె తీర్చి సుఖాన వుండుమని చెప్పి అనేకములయిన భూషణాంబరములు దానికిన్ని కమలాకరునికిన్ని యిచ్చెను - ఆ వేశ్య రాజుయొక్క ఆజ్ఞచేతను కమలాకరుని మనోభీష్టము నెరవేర్చెను కాబట్టి యిటువంటిగుణములునీకు లేవు తిరిగిపొమ్మని చెప్పెను - అంతట భోజరాజుయింటికిపోయె.

మరు నాడు శుభ లగ్నమున తిరుగా భోజ రాజు సింహాసనమెక్క వచ్చెను - అప్పుడు పదో సోపానమునందుండే ప్రతిమ రాజునుచూచి యిట్లనియె.

ఓ రాజా నీవైతే బహు త్వరగా సింహాసనము యెక్కనస్తున్నావు యీసింహాసనము దేవనిర్మితమైనటువంటిది మానుష్య నిర్మిత మయినటువంటిది గాదు - కాబట్టిసామాన్యముగా అందరున్ను యీ సింహాసన మెక్కేటందుకు అర్హులు గారు - విక్రమార్క మహారాజు అనన్యాదృశమైన సాహస వితరణాది గుణములు గలవాడు గనక ఆయన యెక్కేటందుకు అర్హుడైనాడు అటువంటి గుణాలు నీకు కలిగినట్టయితే నీవు తగుదువు ఆ రాజుగుణములు యెటు వంటి వంటే చెప్తా తానువిను - విక్రమార్కుడు రాజ్యముచేసేకాలములో వొక సిద్ధుడు అనేక మంది శిష్యులతో గూడా ఆ రాజుదగ్గిరికి వచ్చి రాజును చూచి రాజుచేత సత్కరించబడి ఆశీర్వదించి కూర్చుండి ఇష్టకథా వినోదంబులం బొద్దుబుచ్చుచుండి రాజుకుజరామరణములు లేకపొయ్యేటట్టుగా వొక పండు యిచ్చి రాజు చేత అంపించబడ్డవాడైసిద్ధుడు పోయెను - తర్వాత వొక బ్రాహ్మణుడుయీసమాచారము విని మహాజరాభార పీడితుడు గనక రాజుదగ్గిరికి వచ్చి అయ్యా నేను యీ ప్రకారముగా ముసిలి తనముచేతను బాధపడుతున్నాను నాశ్రమ నివారణము చెయ్య వలెను అని వేడుకొనగా ఆ బ్రాహ్మణుని ముసిలి తనమున్ను

వణకడమున్ను వొగరోజడమున్ను ఆయాసపడడమున్ను చూచి యీ పండు యితనికి యిచ్చినట్టయితే సుఖించునని యెంచుకొని అతనికి ఆపండు యిచ్చి దాని మాహాత్మ్యము చెప్పి భక్షించుమనెను అతడు అదే ప్రకారము భక్షించగానే అతని ముసలితనమున్ను జాడ్యమున్ను నివర్తించెను - కాబట్టి అటువంటి వితరణాదిగుణములు నీకు కలవా అని ప్రతిమ పలకగానే భోజరాజు తిరుగా యింటికిపోయెను.

తర్వాత భోజరాజు మరియొకనాడు బహు దొడ్డ ముహూర్తము విచారించుకొని సకలాభరణభూషితుడై గంధమాల్యాదులు ధరించి పంచమహావాద్యములు మోగగా ఆదేవనిర్మితమైన సింహాసనము యెక్కరాగా చూచి పదకొండో సోపానము నందుండే ప్రతిమ అతనితో నిట్లనియె.

ఓ రాజా విక్రమార్కునికి కలిగిన సాహసాది గుణములు నీకు కలిగితే యీ సింహాసనము యెక్క వచ్చును లేకుంటే యెక్క గూడదు - ఆయన గుణములు చెప్పుతాను విను.

విక్రమార్కుడు భూసంచారము చేసేటప్పుడు ఒకనాడు నడిచి అలిసివచ్చి ఒక మర్రి చెట్టు కింద కూర్చుండెను - ఆ చెట్టు బహు వూడలున్ను కొమ్మలున్ను గలది ఆ చెట్టుమీద నానాజాతి పక్షులున్ను సాయంత్రము కాగానే తమతమ గూళ్లలో చేరెను - తర్వాత ఆ పక్షులలో సంజీవి అనే పక్షి అన్ని పక్షులనున్ను చూచి మీరు నేటిదినం సంచరించ బోయిన చోట యేమేమి వింతలు చూచినారు అని అడిగెను - అందులో కుక్షింభరి అనే పక్షి యిట్లనియె - నేడు ఉదయాన వింధ్యాటవిని సంచరించబోతిని అక్కడవక పక్షి తన చుట్టాలతో గూడా నిండా విచారపడుతూ వుండగా యీలాగు విచారపడడానకు యేమి ఆపద వచ్చెనని నేను అడిగితిని నా చెలికాడికి ఆపద వచ్చి వుండగా నేను దుఃఖ పడుతున్నాను నాతో గూడా నా చుట్టాలున్ను దుఃఖపడు

చున్నారనిఆపక్షిచెప్పెను-నీకుచెలికాడుయెవడు-అతనికియేమిఆపదవచ్చెన
ని నేనుఅడిగితిని-అప్పుడాపక్షియిట్లనియె - యీ వింధ్యాటవిలోనాచుట్టాలు
న్ను నేనున్ను ఆహారార్థంసంచరిస్తూవుండగా అక్కడికివకబోయవాడు
వేటకు వచ్చి జివురు గండె లున్ను వురులున్ను వొడ్డియింటికి పోయెను మే
మువాటిని కానక అందులోతగులుకొంటిమి వకబ్రాహ్మణుడు సమిధలకు
న్ను విస్తరాకులకున్ను వచ్చి మేమువుండేచెట్టుయెక్కి విచారపడుతూ వుం
డే మమ్మును చూచి విడిచిపెట్టెను నాటినుంచి ఆబ్రాహ్మణుడికిన్ని మాకున్ను
స్నేహము కలిగి వున్నది - యీవింధ్య పర్వతగుహలో వొక రాక్షసు
డువున్నాడు - యీసమీపాన వొక అగ్రహారమున్నది - యీ రాక్ష
సుడు ఆఅగ్రహారికులను అందరిని హింసిస్తూ వుండగా వారు అప్పుడువా
నికి - ప్రతిదినమున్ను వొక మనిషి వొక బండికి రెండుదున్న పోతులగట్టు
కొని ఆబండిమీద నానావిధములైన ఆహారాలు వుంచుకొని వాడువుండే
గుహవద్దికి ఆబండిని తోలుకపొయ్యేది వాడు ఆమనిషినిన్ని దున్న పోతుల
నున్ను బండి మీద వుండే ఆహారములున్ను భక్షించేది - యీప్రకార
ముగా వడంబడికె చేసుకొనిరి అది మొదలు ఆ అగ్రహారికులందరున్ను వం
తువేసుకొనిదినమున్ను వకయింటి మనిషి ఆబండి తోలుక పొయ్యేది కాబ
ట్టి వాడు వూరిమీదికి రాకుండా వున్నాడు - నాకుస్నేహితుడైన బ్రా
హ్మణుడున్ను ఆ అగ్రహారములోనే వుండేది రేపటిదినం ఆయనకు రాక్షసుని
వద్దికిబండి తోలుకొని పోవలసిన వంతువచ్చినది కాబట్టిమేము విచారప
డుతున్నాము అని చెప్పగా నేను వింటినిమరి యేమిన్ని విశేష సమాచార
ములు లేవు అని కుక్షింభరి అనేపక్షి సంజీవి అనే పక్షితోచెప్పెను - అప్పు
డు ఆచెట్టుకిందవుండే విక్రమార్కుడు పక్షి భాష తెలిసిన వాడు గనక ది
గ్గున లేచి చంద్రాయుధము తీసుకొని ఆబ్రాహ్మణుని రక్షించి రాక్షసుణ్ని
సంహరించేనిమిత్తము బండితోలుకవచ్చేమార్గములోకూర్చుండివుండిఅ

తడుబండితోలుక రాగానే నేబ్రాహ్మణుడాబండి నేనుతోలుకపోతానునీవు మీయింటికిపొమ్మని బ్రాహ్మణునియింటికిపంపించిదినాముబండితోలుకపొయ్యే వేళతప్పించిమరిఘుడియకుతోలుకపోయెను - అప్పుడారాక్షసుడు నేడుయింత ఆలస్యముగా బండితోలుక రావడమేమి అనిమహా కోపముతో పండ్లు పటపట కొరుకుతున్న వచ్చెను యీవిక్రమార్కుడు చంద్రాయుధము తీసుకొని ఝళిపించి వాణ్ని తెగవేతామని ఉద్యుక్తుడు కాగానే ఆరాక్షసుడుబ్రాహ్మణరూపముధరించి నేరాజానిన్నుంచి నాకు శాప విమోచన మాయెననేను - అతణ్ని చూచి నీవెవ్వరు నీకీశాపమెట్లావచ్చెనని రాజడిగిననతండిట్లనియె.

నేను నేర్చిన వేదశాస్త్రాలు యెవరికిన్ని చెప్పకున్నందున మాగురువు కోపించి వింధ్య పర్వతమున రాక్షసుడవై పుట్టిమనుష్య మాంసము భక్షిస్తూవుందువు గాక అనిశాపమిచ్చెను - అందుకు నేను వెరచి ఆయన కాళ్ల మీదపడి అయ్యా నాకుశాపవిమోచనము అయ్యేలాగున కటాక్షించండి అని ప్రార్థించగా కొంతకాలానకు విక్రమార్కమహారాజు భూసంచారము చేస్తున్నా యిక్కడికి రాగలడు రాక్షస రూప ధారివైననిన్ను ఆయనయెదిరించగానే నీరాక్షసత్వము పోయి యెప్పటిబ్రాహ్మణత్వము వచ్చునుపొమ్మని గురువులు అనుగ్రహించి చెప్పినారు వారుచెప్పినప్రకారం నేడు. శాపవిమోచనమాయెను - మీవంటిపరోపకారులుయీలోకమందు యెవరున్ను లేరు అయితేమీవంటి పరోపకార బుద్ధిగలవాణ్ని జీమూతవాహనుడనే వాణ్ని వకణ్ని చూచివున్నాను ఆయనపరులనిమిత్తముతన దేహము యిచ్చినాడుఅనియెటువలెనంటే.

హిమవత్పర్వతము దగ్గెర సువర్ణపురమనే పట్టణముగద్దు ఆపట్టణము నందు జీమూతకేతుడనే రాజు రాజ్యము చేస్తూవుండును -

అతడుకొన్నాళ్లకుతనభార్య తో తపస్సు కు పోయెను - అటు తర్వాత అ
తని కొమారుడు జీమూత వాహనుడనే వాడు రాజ్య ము చేస్తూవచ్చె ను -
అప్పుడు కొందరు శత్రు రాజులుఆపట్నముమీదికి దండెత్తివచ్చిరి జీ మూ
త వాహనుడు చతురంగ బలములతో బెట్టు వారితో జగడంచేసి ఆజగడాన
వారిని జయించి మృతిబొంది న తన చుట్టాల నున్ను భ టుల నున్ను చూ చి
యీ రాజ్య ము కోసముగా యింతమందికి చావువచ్చె ను యిటువంటి రా
జ్యము లేకపోతే నేమి అని రాజ్య ముమీద విరక్తిపుట్టితపస్సు చేస్తూ వు న్న
తనతల్లితండ్రు లవద్దికి పోయి నమస్కరించి తాను రాజ్య ము విడిచి పెట్టినసం
గతి వారితో చెప్పి వారికిశుశ్రూష చేసుకొంటూ వనము లో నేసంచరిస్తూ
వుండెను - వక నాడు ఆవన ముండుండే మునికొమారుడైన మధుకరు డనే
వాడు న్ను జీమూత వాహనుడున్ను కందమూల ఫలాదులు తెచ్చే నిమిత్త
ము అడవిలో సంచరిస్తూ వుండగా అక్కడ వక నదిపారుతూవుండెను - ఆ
సమీపాన చంద్ర కాంతపు రాళ్లతో కట్టిన గుడిన్ని బంగారు గోపు రాలు
న్ను అగుపడెను వీరు యిద్దరున్ను ఆగుళ్లోకి పోయి అక్కడి దుర్గకు న మ
స్కరించి ప్రదక్షిణముచేస్తూ వుండగా వొక మంటపములో వొక కన్య కవీ
ణ వాయించిపాడుతూవుండెను - జీమూత వాహనుడుఆగానమునకున్ను దా
నిసౌందర్యానకున్ను మెచ్చి దానియందు మనసుదగిలి ఆకన్య కయెవరో వి
చారించు మని మధుకరు నితో చెప్పె ను - ఆకన్య క చెలికత్తెవీరు మాట్లా
డుకొనేమాటల సవ్వడిబట్టిమధుకరుని వద్దికి వచ్చి యీకన్య విశ్వావసుడ
నే గంధర్వ రాజు కొమార్తె దీని పేరు మలయావతి యీ దేవి తన సంగీ
తానకు మెచ్చి తనకు తగిన పురుషుడు దొరికే టట్టు అనుగ్రహించు గాక
అనే కోరికెతో దినమున్ను యిక్కడికి వచ్చి వీణ వాయించి పాడు తున్న ది
యీ దేవి మనసు లో యెవరినికూర్చున లెనని వున్న దో తెలిశినది కాదు అ
దిఅట్లా వుండనీ యీ రాచకొమారుడు యెవరు జన సంచారము లేని యీ

అరణ్యా మధ్య మందువుండే యీగుడికి యెందుకువచ్చె ను అనిఅడగగా మ
ధుకరుడు దానితోనిట్లనియె,

యీరాజుసువర్ణ పురమనే పట్టణం యేలే వాడుయితనిపేరు జీమూ
త వాహనుడు యీయనగుణాలు ఆదిశేషునికైనా యెంచదరముగాదు త
ల్లిదండ్రులు యీ అరణ్యా మందు తపస్సు చేస్తూవుండగా వారికిశుశ్రూ
ష చేస్తున్నా కందమూల ఫలాదులున్ను పూజకు పత్ర పుష్పాదులున్ను
తెచ్చి యిస్తూవుండవలెనని తానున్నూ వచ్చినాడు నేడు యీ రాజున్ను
నేనున్ను యిట్లావస్తూవుండగా యిక్కడ వీణా గానమువినబడెను - ఆధ్వ
నిజాడబట్టిరాగా గుడిన్ని గోపురాలున్ను అగపడెను యీగుళ్లోకివస్తిమి
యీదుర్గను సేవిస్తిమి నాపేరు మధుకరుడు యీ రాజుకు నేను చెలికా
ణ్ని అభిప్రాయమునీకు తెలిశింది గదా అనిజాడగాచెప్ప గావిని ఆచెలిక
త్తె మలయావతితో యీ సంగతి చెప్పెను - తర్వాత మలయావతి ఆరా
చ కొమారుణ్ని చూచి అతని సౌందర్యానకు మెచ్చుకొని తనతండ్రి
దగ్గిరికిపోయిఅతనితో చెప్పి తండ్రి అనుమతినిజీమూత వాహనుణ్ని పెండ్లిచే
సుకొనెను - ఆరాజుపగటియందుతల్లిదండ్రులకు శుశ్రూష చేస్తూరాత్రి
యందుమలయావతినిసంతోష పెట్టుతూవుండెను - వకనాడుయీరాజువన
మధ్య మునసంచరిస్తూవుండగాఅచ్చటనొకముసలిసామేడుస్తూవుండె
ను- ఆపామునుచూచి వెూసపణ రాజానీవుయెందుకువిచారపడుతున్నావనిజీ
మూత వాహనుడుఅడిగెను - అయ్యాయేమిచెప్పుదునుగరుత్మంతుడుపాము
లనన్నిటినిభక్షిస్తూవుండగాపాములు అన్ని న్ని గుంపుగూడి ఆలోచన చేశి
ప్రతిదినమున్ను వొక్కొక్క పామునుభక్షించేటట్టుగాగరుత్మంతునికి వడంబ
డికె చేసెను నేటిదినంమావంతువచ్చి నదినాకొడుకును శంఖచూడుడనేవా
ణ్ని భక్షించేటందుకువస్తాడు కొడుకునుభక్షించిపోతాడనే దుఃఖముచేతయే

డుస్తున్నానని చెప్పెను - అప్పుడు జీమూత వాహనుడు ముసలి పామును వూరడించి నీవు వెరవవద్దు విచారపడవద్దు నీకొడుకు దేహానికి బదులుగా గరుత్మంతునికి నా దేహమిస్తున్నానని చెప్పి గరుత్మంతుడు రాగానే వూపక్షీంద్రుడా శంఖచూడుణ్ని భక్షించేటందుకు బదులుగా నా శరీరం నీకు యిస్తున్నాను నన్ను భక్షించు శంఖచూడుణ్ని విడిచిపెట్టు - అని ప్రార్థించగా గరుత్మంతుడు ఆప్రకారముగానే శంఖచూడుణ్ని తినడం మాని యితణ్ని భక్షించెను - అప్పుడు మలయావతి తనపతిని గరుత్మంతుడు భక్షించి పోవడం చూచి విచారపడి చితి పేర్చుకొని దుర్గకు మ్రొక్కి వో దేవీ యిన్ని దినములనుంచిన్ని దీర్ఘాయుష్మంతుడైన పతి కావలెనని కోరి నిన్ను కొలిచినందుకు యిట్లా చేస్తివి గదా నేను పూర్వ జన్మమందు మంచి పూజ చెయ్యలేద గాబోలు కాబట్టి నాకు యీ గతి వచ్చినది అయినప్పటికిన్ని యెన్ని జన్మాలకైనా యీ జీమూత వాహనుడు భర్త గావలెనని అగ్ని ప్రవేశముగా బోగానే దుర్గ ప్రత్యక్షమై నీ పాతివ్రత్యానకు మెచ్చితిని నీవు అగ్ని చొరవద్దు వరమడుగు యిస్తాననెను - నా పెనిమిటి బ్రతకవలెనని మలయావతి వరమడిగెను - అప్పుడు ఆ దేవి తన మాహాత్మ్యము చేత జీమూత వాహనుణ్ని బ్రతికించెను - అప్పుడు దేవతలు పుష్ప వర్షము గురియించిరి అప్సరసలాడిరి గంధర్వులు పాడిరి - సమస్తమైన జనులున్ను సంతోషించిరి - కాబట్టి ఆ జీమూత వాహనుని వలెనే నీవున్ను పరోపకారమునందు ఆసక్తిగల వాడవు అని అనేక విధములుగా విక్రమార్కుణ్ని స్తోత్రము చేసి శాప విముక్తుడైన బ్రాహ్మణుడు యథేచ్ఛగా పోయెను - అటువంటి గుణాలు నీకు లేవు పొమ్మనగా నాటిదినం భోజరాజు యింటికి పోయెను.

మర్నాడు శుభలగ్నమందు సింహాసన మెక్కవచ్చే భోజరాజును చూచి పంథొంభో సోపానమందుండే ప్రతిమ రాజుతో నిట్లనియె.

ఓ భోజ రాజా నీవు బహుప్రయత్న పడి యీ దేవ నిర్మితమయిన సింహాసనము యెక్క వస్తున్నావు - యీ సింహాసనము సకలమైన వారికిన్ని సాధారణముగా యెక్కకూడదు యీ భూలోకమందుండేడు వారిలో విక్రమార్కుడు యెక్కవలె లేకుంటే ఆయనతో సమానమైన వారైనా యెక్కవలె నీవు ఆయనతో సమానుడవైనట్టయితే యెక్కవచ్చును ఆయనగుణములు చెప్పుతాను విను - ఉజ్జయినీ నగరములో పట్టభద్రుడనే కోమటికి పురందరుడనే కొమారుడు గలడు - ధనము యెవరికిన్ని అప్పుయివ్వ వద్దు ఖర్చు చేయ వద్దు - అని తండ్రి యెంత చెప్పినా వినక కొడుకు వున్న ధనమంతా వ్రయము చేసె యింకా అప్పులున్ను తీసి ఖర్చు చేసెను - అంతట అప్పులవాండ్లు అతణ్ని పట్టుకొని అప్పు తీసుకొన్న రూకలు యిమ్మని బాధించిరి ఆబాధలు పడలేక పురందరుడు దేశాంతరము పోయి అక్కడక్కడా కొన్నాళ్లుతిరుగుతూ వుండి మధురాపట్నము ప్రవేశించి ఘాటకూళ్లు బెట్టేవాండ్లయింట్లోదిగి రాత్రిభోజనము చేశి పరుండి వుండగా ఆ పట్నానికి బైట ఉత్తరముగా మనిషిని కొట్టినట్టున్ను మనిషి యేడ్చినట్టున్ను ధ్వని వినబడెను - అప్పుడా యింటిముసలి దాన్ని పిలిచి అవ్వా ఆధ్వని యేమి అని అతడు అడిగెను - అయ్యా యీపట్నానికి ఉత్తరాన వొక బిల్వ వనమున్నది అందులో భైరవుని గుడిన్ని కాళికాదేవిగుడిన్ని రెండుగుళ్లువున్నవి - అందులో కాళికా దేవిగుడి దగ్గిర బహుదినాల నుంచిన్ని వకరాక్షసుడు వున్నాడనిచెప్పుతారు - అక్కడదినామున్ను రాత్రి వేళ వక మనిషిని కొట్టినట్టున్ను ఆమనిషి యేడ్చినట్టున్ను వినవస్తున్నది ఆయేడ్పు ఆడదానియేడ్పుగావున్నది - అది పరిశీలించిచూడడానకు యెవరున్ను భయపడుదురు నీకెందుకాజోలి నీవు వూరికెపండుకో అని పురందరునితో ఆయింటి ముసలిది చెప్పెను - తర్వాత అతడు కొన్నాళ్లు ఆపట్నములోవుండి పిమ్మటకొన్నాళ్లు ఆయా దేశములు

తిరిగి మళ్లీ ఉజ్జయినికి వచ్చి తనతల్లిదండ్రులను చూచి - విక్రమార్కుని
సముఖమునకు పోయి తానుఆయాదేశములలో చూచినవింతలన్ని న్ని చెప్పి
మధురాపట్నములో సంగతిన్ని చెప్పెను - అంతట విక్రమార్కుడు పురం
దరుణ్ని వెంటబెట్టుకొని మునుపు పురందరుడు దిగినయిల్లుచేరి - అక్కడభో
జనాదులు కాచేసుకొని పండుకొని వుండగా రాత్రి వేళయెప్పటివలెనే ధ్వ
నివినవచ్చెను - ఆజాడ పట్టుకొని పురందరుణ్ని అక్కడనేవుంచి తాను మా
త్రం ఆగుడిదగ్గిరికి పోయి - ఆరాక్షసుణ్ని చూచి వానితో యుద్ధము చేసి వా
ణ్ని సంహారించి వాని కళేబరము అందరికిఅగుపడేటట్టుగా బిల్వవనానికి
బైటయీడ్చి వేసి అక్కడ మునుపు యేడుస్తూవున్న ఆడదాన్ని చూచి నీవు
యెవ్వరు యీరాక్షసుడిచేత దెబ్బలు పడవలశిన కారణమేమి అని అడిగె
ను - ఆ స్త్రీ రాజును చూచి అయ్యా నా పేరు కాంతిమతి నేను వొకనాడు
గ్రహచారవశముచేత పెనిమిటిమాటకు అతిక్రమించి మాట్లాడితినిఆయన
కు కోపంవచ్చి యీదుర్గగుడివద్ద కాచుకొనివుండే రాక్షసుని చేత దెబ్బ
లు తింటూవుండువు గాక అని శపించి యీ రాక్షసునికి వప్పగించెను అప్పు
డు నేను పెనిమిటి కాళ్లమీదబడినాకు యీ అనుభవముయెన్నాళ్లదాకా
ను అనిఅడిగితిని ఆయనకుదయవచ్చి యిక్కడికి కొన్ని దినాలకు వెనకవిక్ర
మార్కుడనేరాజు వచ్చి యీరాక్షసుని సంహరించును అంతటనీకుశాపవి
మోచనమవును అని చెప్పెనుయిప్పుడు నాబాధ నీవు నివర్తింపచేస్తివి నీ
కు ప్రత్యుపకారము నేనేమిచెయ్యగలను అయినప్పటికిన్ని నా చేతనయి
నపని వకటివున్నది యీబిల్వవనమందు భైరవునిగుడిముందర వొకచట్రా
యివున్నది ఆరాతికింద యీ రాక్షసుడు తొమ్మిదికోట్లధనం పూడ్చి పెట్టి
తన్ను చంపిన వానికిఆధనంవచ్చును గాని యితరులకు రాదు అని అందులో
వ్రాశి వేసినాడు యిప్పుడు వాణ్ని నీవుచంపినావు గనక ఆ ధనం నీవుతీసు
కోవచ్చునని ఆధనముపుండేచోటు రాజుకు చూపించెను - ఆరాజు ధనము

బైట తీసిపురందరుణ్ని పిల్చి నీవువున్న రూకలంతా వ్రయము చేసుకొని అప్పుల పాలై వున్నావు గనక యీధనము నీవు తీసుకొమ్మని తొమ్మిది కోట్ల ధనమున్ను అతనికి వప్పగించి తన పట్నానికి పోయెను - అటువంటి గుణాలు నీకు లేవు కాబట్టి యీసింహాసనము యెక్క వద్దనెను-అంతట భోజరాజు యింటికి పోయెను.

మరునాడు మంచి ముహూర్తము విచారించుకొని యెప్పటివలె నేసింహాసన మెక్క వలెననే ఆసక్తిచేతనూ బహు త్వరగా వచ్చే భోజ రాజును చూచి పదమూడో సోపాన మందుండే ప్రతిమ యిట్లనియె.

వోభోజ రాజా నీకైతే యీసింహాసన మెక్క వలెనని ఆసక్తినిండావున్నది యిది దేవనిర్మితము గాని మనుష్య నిర్మితము గామయిది అందరున్ను యెక్కేటందుకు అర్హులు గారు విక్రమార్కుడు వొకడు అర్హుడు - ఆరాజుకు కలిగిన సాహస వితరణాలు నీకువున్నట్టయితే యెక్కవచ్చును లేకుంటే యెక్కగూడదు ఆయన గుణాలు నీవు యెరుగుదువో యెరగవో చెప్పు తాను విను విక్రమార్కుడు తాను భూసంచారము చేసే కాలములో గంగా తీరమందు ధర్మపురమనే అగ్రహారము చేర ఆరాత్రి అక్కడ నిలచి మర్నాడు గంగా స్నానము చేసి నిత్యకర్మములాచరించి విశ్వనాథుణ్ని విశాలాక్షిని సేవించి అక్కడ పురాణము చెప్పే బ్రాహ్మణుల వద్దపురాణము వింటూ కూర్చుండెను- అప్పుడు వక బ్రాహ్మణ స్త్రీ యేడుస్తూ వచ్చి తన పెనిమిటి గంగలో స్నానము చేస్తూవుండగా మొసలియీడ్చుకపోయెను - అని మొర పెట్టగా విక్రమార్కుడు విని గంగలో దుమికి బ్రాహ్మణు యీడ్చుకపొయ్యే మొసలిని చంపి బ్రాహ్మణుని విడిపించెను ఆ బ్రాహ్మణుడు విక్రమార్కుని ఆశీర్వదించి నీవు మహాదొడ్డవాడవు నీవు నన్ను బ్రతికిస్తివి నీకు ప్రత్యుపకారము నేనేమి చేయగలను - నేను నేర్చిన మంత్రము వ

కటివున్నది అదిపఠిస్తే సర్వ పాపములున్ను నశించిపోను - కావలశినప్పుడు దేవలోకాన్నుంచివిమానంవచ్చును వకరికి ఉపదేశము చేశిన వెనక ఉపదేశం చేశిన వానికి ఆమంత్ర ముఫలించదు ఉపదేశంచేయించుకొన్న వానికి మాత్ర మేఫలించును అది నీకు ఉపదేశం చేస్తాను నేర్చుకొమ్మని మంత్రముపదేశించెను - తర్వాత తానున్ను తనభార్యానున్ను రాజుచేత సెలవు దీసుకొనితను యింటికిపోయిరి - అక్కడినుంచి విక్రమార్కుడు భూసంచారము చేస్తున్న వుండగా వింధ్యపర్వతము దగ్గిర వకపాడుగుడిముందర వుండే అశ్వత్థవృక్షం మీద వకబ్రహ్మరక్షస్సువుండెను దాన్ని చూచినీవు యెవ్వరు యిక్కడ యెందుకు వున్నావు అనివిక్రమార్కుడు అడిగెను - అప్పుడాబ్రహ్మరక్షస్సుయిట్లనియె.

తొల్లిమాళవ దేశమేలే రాజుదగ్గిర నేను పురోహితుణ్ని ఆరాజు వచ్చినవిద్వాంసుల కందరికిన్ని సమస్తమైన బహు మానములు చేసేవాడు విద్వాంసులనుపరీక్షించే అధికారము నాకుయిచ్చి నాడు నేనువిద్యా గర్వము చేతనున్ను ధనగర్వంచేతనున్ను యెంతటి విద్వాంసుడు వచ్చినప్పటికిన్ని పూర్ణప్రజ్ఞ లేదని యెత్తివేస్తూవుంటినియిట్లావుండగా వొకబ్రాహ్మణుడు వేదశాస్త్రముల యందు అసాధారణప్రజ్ఞగల వాడు రాజ సభకు పరీక్షయిచ్చే నిమిత్తమువస్తే నాగర్వముచేత ఆయనఘట్టివాడు కాడనిరాజుతోచెప్పితిని - అప్పుడు ఆబ్రాహ్మణునికి కోపము వచ్చి ప్రజ్ఞవిచారించక నన్ను అవమానము చేస్తివి గనకనీవుబ్రహ్మరక్షస్సువై పుట్టుమని నాకు శాపమిచ్చెను - అప్పుడు నేనుభయపడి ఆయనకు సాష్టాంగముగానమస్కరించి అయ్యా బుద్ధిహీనతవల్ల అట్లాచెప్పితిని నాతప్పుక్షమించవలెను తమరుసర్వజ్ఞులు మహానుభావులు యీప్రకారముగా నాయందు కోపము

చేశిశపియి స్త్రీరినాశాపమునకు త్వరగా విమోచనము కలిగేటట్టుగా అనుగ్రహించండి అని అనేకవిధములుగా బహు దీనుండనై ప్రార్థించగా ఆయన కోపాగ్ని చల్లారినన్ను చూచి ఓరోయీ నీవు ఫలాని చోట వుంటివంటే కొన్ని దినములకు అక్కడికి విక్రమార్కుడనే మహారాజు వస్తున్నాడు ఆయననుంచి నీకు శాపవిమోచనమవును అని చెప్పెను - నాటనుంచి నేను బ్రహ్మరక్షస్సునై యిక్కడవుండి నీరాకకెదురుచూస్తూ వున్నాను నీవు మహాధర్మాత్ముడవు నీపరాక్రమము కెవరికిన్ని లేదు నేడు నా అదృష్ట వశము చేత నీదర్శనము దొరికెను - అని బహుప్రకారములుగా స్తోత్రము చేశి గంగాతీరమందు నీవు మొసలిచేత పట్టుబడిన బ్రాహ్మణుని విడిపించినందువల్ల నీకు వచ్చిన పుణ్యము నాకు ధారబోశి నీవు ఆ బ్రాహ్మణుని వల్ల గ్రహించిన సర్వ పాప నాశకమయిన మంత్రము నాకు ఉపదేశము చేస్తివా శాపవిమోచనమవుచున్నదని ప్రార్థించగా రాజు ఆ బ్రహ్మరక్షస్సు అడిగిన ప్రకారముగా ఆఫలము ధారబోశి ఆమంత్ర ముపదేశించెను - అప్పుడా బ్రహ్మరక్షస్సుకు బ్రాహ్మణత్వము వచ్చి విక్రమార్కుణ్ని చూచి ఓరాజా నిన్నుంచి నేను శాపవిముక్తుడనై కడతేరితిని నీవు దీర్ఘాయుష్మంతుడవుగానుండుమని రాజుచేత శెలవుతీసుకొని విమానారూఢుడై ఖేచరమార్గాన పోయెను - అంతట విక్రమార్కుడు ఉజ్జయినికి వచ్చి రాజ్యము చేస్తూవుండెను - అటువంటి గుణాలు నీకు గలవా అని ప్రతిమ పలకగా యింతలో ముహూర్తకాలము మించిపోయెను - నాటిదినం భోజ రాజు యింటికిపోయెను.

మనార్డు యెప్పటివలె నేసింహాసనమునెక్క వచ్చే భోజరాజును చూచి పధ్నాలుగో సోపానమందుండే ప్రతిమ ఓభోజరాజా విక్రమార్కుని సాహసాది గుణములు నీకువుంటే యీసింహాసనమెక్కవచ్చును ఆయనగుణములు చెప్పుతానువినుమని భోజరాజుతో నిట్లనియె.

విక్రమార్కుడు భూసంచారము చేశేటప్పుడు పుళింద దేశాన దినకరమనే నగర సమీపాన వుండేపాప వినాశని అనేనదిలోస్నానము చేశినిత్యకర్మానుష్ఠానములు తీర్చుకొని ఆనదిదగ్గిరవుండే వనములోకిపోయి అక్కడ వకసిద్ధుడుండగాచూచినమస్కరించెను నీవుయెవ్వడవుయెందునిమిత్తముయిక్కడికివచ్చినావుఅనిసిద్ధుడుఅడిగెను-నేనువిక్రమార్కుణ్ని ఆరు నెలలు రాజ్య పరిపాలన చేతును - ఆరు నెలలు భూసంచారము చేతును - కాబట్టి అన్ని దేశాలు తిరుగుతూవుండి యీదేశమున్ను చూచి పోదామనివస్తి నియిక్కడవింతలుయేమైనాకలవాఅనిరాజుఅడిగెనునీవుసర్వలక్షణాలు గలవాడవు బహు రాజ్యమున్ను బహు సేనలున్ను గలవాడవు దేశములు చూడవలెననియిచ్ఛ బుట్టినట్టయితే సేనలతో గూడా తిరగవలెనే కాని వొంటిగా తిరుగుదురాయిట్లా వొంటిగానీవుతిరుగుతూవుంటేనీవువుండే చోటయేమైనావింతలుపుట్టవాకాబట్టి నీవు తిరుగాత్వరగానీపట్నమునకు పొమ్మనిసిద్ధుడు చెప్పెను అందుకురాజునవ్వి అయ్యా మీరు సకలము తెలిశిన వారు సుఖదుఃఖాలు కర్మానుసారము గావచ్చును - వొంటిగా తిరిగితే నేమి సేనలతో తిరిగితే నేమి కావలశినపని కాకపోదు - అదియేలాగంటే.

తొల్లి రాజశేఖరుడనే రాజుగలడు ఆయనపగవారిచేత రాజ్యముకోలుపోయి తనభార్యతో గూడా అరణ్యముప్రవేశించి అందు కందమూలఫలాలు భక్షించి కాలము గడుపుతూ వుండగా ఆ అడవిలో నొకమర్రిచెట్టుమీదఅయిదు గురుయక్షులు వచ్చి కూచుండి యుండిరి ఆ సమయమందుదైవయోగమువల్లయీరాజ్యముకోలుపోయిన రాజుతనభార్యతో గూడావచ్చి ఆచెట్టు కిందకూచుండి విచారపడుతూ వుండగా ఆచెట్టుమీ

దవున్న యతులలో నొకడు మద్ర పురము నేలే రాజు యుద్ధములో పడి
పోయినాడు గదా ఆరాజ్యానికి యెవరిని పట్టంగట్టుదురో తెలియ లేదు అని
చెప్పెను మరియొకసిద్ధుడు ద్రవిడ దేశంయేలే రాజు రాజశేఖరుడనేవా
డు తన రాజ్యము శత్రువుల చేత కోలుపోయి అడవుల పాలై తిరుగుతూ యి
ప్పుడు భార్యా సమేతముగా యీ చెట్టు క్రింద కూచుండి వున్నాడు అతడై
తే ఆరాజ్యానికి అర్హుడు అని చెప్పెను - కడమ వారున్ను అట్లాగే
యీ రాజశేఖరుణ్ని పిలుచుక పోయి పట్టంకట్టుదాము అని సమ్మతించిరి -
యీప్రకారము అయిదుగురున్ను యేక వాక్యతగా నిశ్చయించి చెట్టు దిగి
వచ్చి ఆరాజశేఖరుణ్ని తట్టి వోయిరాజా మేము యతులము మనుష్యులకు
అందరికిన్ని అగుపడము నీమీద మాకు దయవచ్చినది గనక నీకు అగుపడితిమి యి
క్కడికి రెండామడ దూరమున మద్ర పురమనే పట్టణమున్నది - ఆసమీపా
న శోణ అనే నదివున్నది - మీరు దంపతులు యిద్దరు పోయి ఆనదిలో స్నానము
చేశి అక్కడవుండే మద్రేశ్వరుణ్ని సేవించి గోపురం వాకిట నిలిచివుంటే -
ఆపట్నము వారు మంత్రి పురోహితుడు మొదలు గాగల వారు పట్టపు యేనుగ
చేతికి సంపెంగ పూలదండ యిచ్చి ఆయేనుగ ఆదండ యెవరి మెడను వేస్తున్న
దో వారిని యీపట్టణమునకు రాజును గా పట్టాభిషేకము చేతామని వున్నా
రు ఆయేనుగ మేము చెప్పినట్టు చేసును మా యనుమతిని ఆయేనుగ నీకు పూలదం
డ వేస్తున్నది వెయ్యగానే ఆరాజ్యానికి నిన్ను పట్టాభిషిక్తుణ్ని చేస్తున్నారు యి
దిగాక దైవసహాయము చేత మునుపటి నీ రాజ్యము నీకు మల్లీ వస్తున్నది- అని
చెప్పి యతులు ఆశీర్వదించి పోయిరి—తర్వాతను వీరు శీఘ్రముగా లేచి య
తులు చెప్పిన ప్రకారముగాను మద్రపురానికి పోయి శోణనదిలో దంపతు
లు స్నానము చేశి మద్రేశ్వరుణ్ని సేవించుకొని గోపురము వద్ద నిలుచుండివుం
డగా-ఆపట్నపు వారి చేత అంపించబడ్డ యేనుగ సంపెంగ పూలదండ యీ రా

జుమెడను వేశెను. అప్పుడుఆరాజ్యానికియితణ్ని పట్టాభిషిక్తుణ్ని చేశిరి. తర్వాత మద్ర నగరానకు రాజశేఖరుడు రాజుఅయినది విని మునుపు రాజశేఖరుని రాజ్యముకట్టుకొన్న రాజుమద్ర నగరము మీాదికిదండెత్తి వచ్చెను - అప్పుడు రాజశేఖరుడు ఆదండును చూచి భయపడక - మన కేమియక్షులు యీారాజ్యముయిచ్చినారు వారిమనసు వచ్చి నన్ను వుంచితే వుంచుతారు తీసివేస్తే తీసివేస్తారు అనిమహాధైర్యముతో యక్షుల నుధ్యానముచేస్తూవుండెను - అప్పుడుయక్షులు యీాసమాచారంత మదివ్యదృష్టిచేతను తెలుసుకొనిఅర్ధరాత్రి వేళవచ్చి శత్రు రాజుల దండుమీాద పడి వారినందరిని సంహరించిరి తర్వాత తనశత్రువుయుద్ధరంగమందుయక్షులచేత హతుడాయెగనక రాజశేఖరుడు మునుపటి తనరాజ్యమున్ను తానేకట్టుకొని సుఖముగావుండెను - కాబట్టి దైవబలము కలిగివుంటే ఒంటిగా వుంటేనేమి సేనలతో కూడా వుంటేనేమి అనివిక్రమార్కుడు చెప్పగాసిద్ధుడువిని రాజుగుణాలకు మెచ్చి రాజుకు వకలింగము యిచ్చి వూరాజాదీన్ని యెవరు పూజచేస్తున్నారో వారికి ఇష్టార్థసిద్ధి అవునుఅని చెప్పి శెలవుయిచ్చెను - తర్వాత సిద్ధునిచేత అనుజ్ఞ తీసుకొని తనఉజ్జయినీనగరానకు పోతూవుండగా దోవలో వొక బ్రాహ్మణుఁడు రాజును చూచి నేనుదారిద్ర్యముచేతబహు కష్టపడుతున్నాను నాదారిద్ర్యము తీర్చవలెనని బహుదీనుడై యాచించగా రాజు ఆబ్రాహ్మణునిఆదరించి దయచేశితనకుసిద్ధుడుయిచ్చిన లింగముఆబ్రాహ్మణునికి యిచ్చి యీాలింగమునునీవుపూజచేస్తే నీపేదరికము పోయిసకల భాగ్యమున్ను వచ్చునుఅని బ్రాహ్మణుని పంపించితాను ఉజ్జయినికి పోయెను - అటువంటిగుణాలులేకయీా సింహాసనమెక్కరాదు అనగానాటికి భోజరాజు యింటికి పోయెను.

మర్నాడు తిరుగాసింహాసనమెక్కవచ్చే భోజరాజునుచూచిపదిహేనోసోపాన మందలి ప్రతిమయిట్లనియె.

ఓ రాజా విక్రమార్కుని గుణములవంటి గుణములు లేని వారుయీ
సింహాసన మెక్క కూడదు ఆ యనగుణము లెటు వంటివంటే - విక్రమా
ర్కుడు రాజ్యము చేస్తూ వుండేటప్పుడు సుశ్రీకుడనే బ్రాహ్మణుడు తీర్థ
యాత్ర చేసుకోవలెనని పోయి సమస్త భూమిన్ని సంచరిస్తున్న స్త్రీలుయే
లే దేశానికి పోయెను - అక్కడ నొక కాళికా దేవి గుడియుండెను - ఆగుడి
లో ప్రవేశించి పోగా ధ్వజస్తంభముదగ్గిర సలసల కాగే నూనె కొప్పెర
అగుపడెను దాని చేరువను వొక బంగారు మంటపములో నొకశాసనము
న్ను అగుపడెను - ఆ శాసనములో యెవ్వడుయీ కాగే నూనె కొప్పెరలో
తెంపు చేశి దుముకుచున్నాడో వాడుయీ స్త్రీలనున్ను యీ పట్టణమున్ను
యేలే వాడవును అని వ్రాశి వున్నది - ఆ సుశ్రీకుడు అది చదువుకొని మరిన్ని
అక్కడి వింతలు కొన్ని చూచి సకలతీర్థములు సేవించుకొని కొన్నాళ్లకు వె
నక ఉజ్జయినికి వచ్చి తన యింటికి పోయి తల్లి దండ్రులను చుట్టాలను సక
లమైన వారినిం జూచి తర్వాత విక్రమార్కుని సభకు పోయి విక్రమార్కు
నిచేత మన్నింపబడి యీ రాజును ఆశీర్వదించి తాను చూచిన వింతలన్ని
న్ని చెప్పగా విక్రమార్కుడు విని ఆశ్చర్య పడి ఆక్షణమే ఆ సుశ్రీకుని పి
లుచుకొని స్త్రీలుయేలే దేశానికి పోయి కాళికా దేవి గుడిప్రవేశించి కాగే
నూనె కొప్పెర బంగారు మంటపము శాసనమున్ను చూచి శాసనము చదు
వుకొని స్నానము చేశి కాళికా దేవిని శేవించి ఆ బ్రాహ్మణ్ని వెరవవద్దని
మహాధైర్యముతో ఆనూనె కొప్పెరలో దుమికెను - అప్పుడా నూనె విక్ర
మార్కుని దేహానికి చల్లగావుండెను - అంతట చన్నీళ్లలో మునిగి లేచినట్టు
నూనెలో నుంచి లేచి బయిటవచ్చెను - తర్వాత ఆ పట్నములో వుండే రా
చ స్త్రీలు వచ్చి విక్రమార్కుని చెయిపట్టుకొని బంగారు మంటపములో
కూచుండబెట్టుకొని సకలమైన ఉపచారములున్ను చేశి నీవు మహా దొడ్డ
రాజవు మాకోర్కె యీడేరెను - నీవుమమ్ము నవివాహము చేసుకొనియీ

రాజ్యమంతా యేలవలెను అని చెప్పగా విక్రమార్కుడు చాలా సంతోషించి యా బ్రాహ్మణుడు మునుపు తాను యిక్కడికి వచ్చి చూచి నాతో చెప్పగా నేను యీయన నిమిత్తం వచ్చినాను కాబట్టి మీరు యీయనను వివాహము చేసుకొని రాజ్యమునకు పట్టాభిషిక్తుని చెయ్యవలెను అని చెప్పి ను వారు ఆప్రకారము సమ్మతించిరి - తర్వాత ఆయనకు పెండ్లి చేయించి పట్టాభిషేకము చేయించి తాను తిరుగా ఉజ్జయినికి వచ్చెను - కాబట్టి అటువంటి గుణములు నీకు లేవు యీ సింహాసనమెక్కేటందుకు నీకు తగదు పొమ్మనగా యింతలో ఆదినమున్ను లగ్నము తప్పి పోయెనని భోజరాజు యింటికి పోయెను.

మర్నాడు తిరుగా మంచి లగ్నాన సింహాసనమెక్క వచ్చే భోజరాజును చూచి పదహారో సోపానమందున్న ప్రతిమ యిట్లనియె.

ఓ భోజరాజా విక్రమార్కునికి గల గుణములు లేని వాడు యీ సింహాసనము యెక్కేటందుకు యోగ్యుడు గాడు ఆయన గుణము లెటువంటివని న వినుము - విక్రమార్కుడు రాజ్యము చేసేటప్పుడు వొక బ్రాహ్మణుడు సంతానము లేక యీశ్వరుని గురించి తపస్సు చేయగా ఈశ్వరానుగ్రహమువల్ల నొక కూతురు గలిగెను - ఆ చిన్నదాన్ని బహుగారాబముగా పెంచి యోగ్యుడైన బ్రాహ్మణునికి యివ్వవలెనని తలచి పెండ్లి కొమారుని విచారించి పెండ్లి శెలవుకు లేక పెండ్లి కొమారుణ్నిన్ని తన కొమార్తెనున్ని విక్రమార్కుని సముఖానకు వెంటబెట్టుక వచ్చి రాజును ఆశీర్వదించి స్తోత్రము చేయగా రాజు సంతోషపడి ఆ చిన్నదాన్ని చూచి నీకు యేమి కావలెనని ముందుగా అడిగెను - అప్పుడా చిన్నది యిట్లనియె — రాజ్యమేలుచున్న — జాత్యధికుల రక్షించి — ఈర్ష్యాసూయలు లేని వాడవై - వదాన్యుడవై — రుద్రపూజలు చేయుచున్న — నిత్యాన్నదా

నముచేసి — విప్రభక్తి కలిగి— వాజపేయాదియజ్ఞములుచేయించుచు— హరిహరభక్తులకు — ముదంబుతో — కామధేనువువలె — వజ్రవైడూర్యాదులు — లెక్క లేకుండా యియ్యవలెను - అని చెప్పగానేవిక్రమార్కుడు ఆచిన్నది చెప్పినపదమూడు మాటల మొదటి అక్షరములుగూర్చి — రాజా ఈవరునివివాహముకావలె — అన్న అర్థము తెలుసుకొనిచాలా సంతోషపడి ఆచిన్నదానికి పదమూడులక్షలవరాలుయిచ్చి యింకాఅనేక భూషణాంబరములుయిచ్చి అంపించెను - కాబట్టి అటువంటివితరణగుణంనీకు లేదుసింహాసనమెక్కేటందుకు యోగ్యత లేదనగా యింతలో ముహూర్తము మించిపోయెగనక - నాటిదినం భోజరాజు యింటికి పోయెను.

మరియొకనాడు తిరుగా భోజరాజు మంచివేళ విచారించుకొని సింహాసనము యెక్కవస్తూవుండగాపది హేడో సోపానమునందున్న ప్రతిమచూచి యోరాజావిక్రమార్కునికి గలసాహసాది గుణములునీకున్నవా అటువంటి గుణములు లేనివాడైతే వానికి యీసింహాసనము యెక్కేటందుకు అర్హత లేదు ఆయనగుణములు యెట్టివంటేవిను.

విక్రమార్కుడు రాజ్యమేలే కాలమందు యొకభట్టువాడు - అవంతిపుర మేలేరాజుదగ్గిరికిపోయివిక్రమార్కుని శౌర్య సాహసాదులను గురించిచెప్పి వుండేపద్యములుకొన్ని చదవగా అవంతిరాజు విని అసూయ చేత వానికి స్వల్పముగా బహుమానము చేయించివాణ్ని అంపించి తర్వాతవిక్రమార్కుని కీర్తికి ఆశ్చర్య పడిమనకుఅటువంటికీర్తి యెట్లా వచ్చునుఅనిచింత చేస్తూ వుండెనుఅప్పుడు యొకసన్యాసివచ్చిఆరాజును చూచిరాజానీవుమహాదొడ్డవాడవు యిప్పుడునిన్ను చూస్తే కొంచెము యేమోవిచారపడేటట్టుగావున్నదియెందుకు విచారపడుతున్నావు యేమివిం

తలుచూచినావు నాతోచెప్పు మనగాసన్న్యాసినిచూచి అయ్యా నేడొక
భట్టువాడువచ్చి నాడువాడువిక్రమార్కుని మీదచెప్పి వుండేపద్యాలు
చదివినాడు సమస్తదేశాలరాజులమీదిపద్యాలువిన్నానుగాని యిటువం
టికీర్తి గలవాడు యెవడున్ను లేడుఅతనిశౌర్య సాహసాది గుణములు విం
టేఅత్యాశ్చర్యముగావున్నది-అటువంటికీర్తి నాకుయెట్లా కలుగునని చిం
త చేస్తున్నాను - అనిచెప్పెను - ఆమాటసన్న్యాసివిని వో రాజా అ
యితేనేమాయెను యింతమాత్రానికే నీవు విచారపడవచ్చునా - నీ యి
ష్టసిద్ధికినేనొక యుపాయముచెప్పుతాను విను - హిమవత్పర్వతముద
గ్గర నొకదుర్గగుడివున్నది అక్కడకొందరు యోగపురుషులు సర్వదా
హోమము చేస్తూవున్నారు నీవక్కడికిపోయిస్నానముచేశి దుర్గను సేవిం
చి దుర్గను గూర్చి హోమము చేశి తర్వాత ఆహోమగుండములో నీవుధుమి
కి నీశరీరం పూర్ణాహుతిగా యిస్తే అక్కడియోగపురుషులు నిన్ను మళ్లీ
బ్రతికింతురు - అప్పుడు దుర్గ నీకు ప్రత్యక్షమయి నీకు కావలశిన వరము
లిచ్చును - అనిచెప్పి స్వేచ్ఛగాపోయెను - ఆవెనక అవంతీశ్వరుడుఆ
లాగే హిమవత్పర్వతానకుపోయి దుర్గగుడి చూచి అక్కడస్నానముచే
శి దుర్గను సేవించి ఆదేవిని గూర్చి హోమము చేశి తర్వాత ఆహోమగుం
డములో ధుమికి తన శరీరం పూర్ణాహుతిగా యిచ్చెను - అక్కడియోగ
పురుషులు అతణ్ని తిరగా బ్రతికించిరి - అప్పుడు దుర్గ ప్రత్యక్షమయి
నీకుయేమి కావలెనో అడుగుమనగా తననగరులో ప్రతిదినమున్ను యే
డుకోట్ల ధనమువచ్చి పడుతూ వుండవలెను అనిఅడిగెను ఆమాటదుర్గవిని
అయితే నీవు ప్రతిదినమున్ను మీపట్నములో యీలాగున నన్ను గూర్చి హో
మము చేశి ఆహోమగుండములో నీశరీరము పూర్ణాహుతిగా యిస్తూవుం
టేఅట్లాగే యేడుకోట్ల ధనము ప్రతిదినమున్ను వచ్చి పడుతూవుంటుందిపో

ష్మనెను - అందుకుఆరాజు సమ్మతించి యిష్టార్థసిద్ధి ఆయెగాకా అనిసంతో షించిదుర్గకు మొక్కి యోగపురుషులచేత శెలవుతీసుకొని తనపట్నా నకువచ్చెను - అదిమొదలుకొని ప్రతిదినమున్ను అడిగిన వారికి అడిగినట్టెల్లా ధనముయివ్వ సాగెను - అతనిదాతృత్వము మహాప్రసిద్ధి ఆయెను - ఆసమాచారము ఉజ్జయినీనగరములోవిక్రమార్కుడు అర్థులవల్లను చారులవల్ల నున్ను వినిఅవంతి రాజువలెనే తాను హిమవత్పర్వతమువద్దికిపోయిదుర్గనుగురించితనశరీరముపూర్ణాహుతిగాయివ్వగాదుర్గప్రత్యక్షమై నీకుయేమి కావలెనో అడుగుమనెను - అప్పుడువిక్రమార్కుడు సంతోషించి దుర్గను చూచియిప్పుడుఅవంతి రాజు ప్రతిదినమున్ను నిన్ను గూర్చి తనదేహాన్ని పూర్ణాహుతిగాయిస్తూశ్రమపడుతూవున్నాడుగదా అట్లా అతనిదేహం ఆహుతిగా యివ్వకనేఅతనికి యేడుకోట్ల ధనమున్ను ప్రతిదినమున్ను కలిగేటట్టుగావరమివ్వుమనిఅడిగెను - అంతటదుర్గయితని గుణానికి మెచ్చి అట్లా గేవరమిస్తినిపొమ్మనెను తర్వాత విక్రమార్కుడు ఉజ్జయినికి వచ్చి తనమనుష్యులచేతఅవంతిరాజుకుయీసమాచారమంపించెను - అదివినిఅవంతిరాజు ఆశ్చర్య పడిమెచ్చుకొనివిక్రమార్కునివద్దికివచ్చి మీవంటి రాజుయీలోకమందుయెవడున్ను లేడుఅనిబహువిధములుగాస్తోత్రము చేశివిక్రమార్కుడిచేత శెలవు తీసుకొనితనపట్నానకుపోయెను - కాబట్టిఅటువంటి గుణములు నీకుగలవా అనిఅడుగగాభోజరాజు ముహూర్తము మించి పోయెనని నాటి దినం యింటికి పోయెను.

మరునాడు తిరుగా మహోత్సుంచిముహూర్తమువిచారించుకొనిసింహాసనము యెక్క వచ్చే భోజరాజును చూచిపద్ధెనిమిదో సోపానమునందున్నప్రతిమయిట్లనియె.

ఓరాజా నీవుబహుళత్వరగా సింహాసనమెక్క వస్తున్నావు విక్రమార్కమహారాజుకు కలిగిన గుణములవంటి గుణములు కలిగినట్టైతేనే కానియెక్కరాదు - ఆయన గుణములు యెటువంటివంటే విక్రమార్కుడు రాజ్యముచేస్తూవుండే సమయములో మనోవేగుడనే సిద్ధుడు వొకడు వచ్చి విక్రమార్కుని చూచి ఆశీర్వదించి ఓరాజా నేను సమస్తమైన నదులున్ను పర్వతాలున్ను వనములున్ను పట్టణములున్ను సప్తద్వీపములున్ను చూచినాను యీభూలోకమందు నీవలె సర్వలక్షణాలు గల రాజు యెక్కడాలేడు నీవు మహాదొడ్డవాడవు అని స్తోత్రము చేయగా మీరుయిన్ని దేశాలు చూచినారు అచ్చటివిశేషాలలో యేదైనా వొకటిచెప్పండని రాజు అడిగెను - ఆమాటసిద్ధుడువిని అయ్యా ఉదయపర్వతముదగ్గిర కనకపురమనే పట్టణమున్నది - ఆపట్టణములో అఘవినాశనమనే కోనేరువున్నది - ఆకోనేటిలో సూర్యోదయకాలమందు వొకబంగారుస్తంభముపుట్టును - మధ్యాహ్నమువేళకు సూర్యమండలమంటును - ప్రొద్దుతిరుగగానే అస్తమానమువేళకుకొంచెకొంచెముగాకోనేటిలోబొత్తిగామునుగును-అనిరాజుతోచెప్పెనుయిది అంతా రాజువిని ఆశ్చర్యపడి అయ్యామీరు యింతపిన్న వయసుననే యీభూలోకమంతాయెట్లాసంచరిస్తిరి నాకు వినేటందుకు ఆశ్చర్యముగావున్నది అనగాసిద్ధుడుమావద్దవఖ దివ్యపసురువున్నది - అదికాళ్లకురాచుకొని యెక్కడికి పోవలెననితలిస్తే ఆక్షణం అక్కడప్రవేశిస్తున్నాము - అనిచెప్పెను - అప్పుడురాజు అఘవినాశనము చూడవలెనని నాకు అభిలాషవున్నది - నేనుమీవెంటవస్తాను నన్ను పిలుచుకపొండి అనగారాజుకున్ను ఆపసురు కొంచెముయిచ్చి కాళ్లకు రాచుకొమ్మనితానున్ను తన కాళ్లకు పసురు రాచుకొనిఅఘవినాశనమునకుపోవలెనని తలచగానే ఆక్షణం యిద్దరుపోయి అక్కడనిలిచిరి - అంతట రాజు - ఆకోనేటిలో స్నానము చేసి ఉదయకాలమందు ఆకోనేటిలో బంగారు

స్తంభము మొలవగానే దానిమీదకూర్చుండెను - అదిమధ్యాహ్న వేళ కుసూర్య మండల మంటెను - అప్పుడుసూర్యుడుతన కిరణముల వేడిమికి భయపడక వచ్చి నందుకు మెచ్చి యీ రాజుకు తనకిరణములుచల్లగా వుండేటట్టుచేశి అనంతరంతాను ప్రత్యక్షమైది వ్య కుండలము లిచ్చి యీ కుండలములుయెవరియింట్లో వుంటున్నవో వానికిప్రతిదినమున్నువొక బారు వసువర్ణము యింట్లోపుట్టును - అనిచెప్పి శెలవుయిచ్చెను తర్వాత సాయంకాలానకు కొంచెకొంచెముగాకూనేటిలో ఆ స్తంభముబొత్తిగామణగగానే యీదుకొంటూ గట్టుకువచ్చెను అప్పుడుసిద్ధుడున్ను తానున్ను తనపట్నానికి వచ్చిరి - ఆసమయమందు వొకబ్రాహ్మణుడుదక్షిణదేశాననుంచి వచ్చి రాజును చూచి అయ్యా నేను మాపెద్దలు సంపాదించిన ధనముకొంచెము గొప్పలవుండగా అదిబెట్టుకొని యజ్ఞాదులు చేసుకొంటూ వచ్చినవారికెల్లా అన్నదానము చేస్తూవుంటిని నామీదగిట్టక నాకునిక్షేపము దొరికినదని వొకమనిషి రాజుతో కొండెము చెప్పినాడు ఆరాజు విని నాయిల్లంతా కొల్లబెట్టుకొని యింకాకోటి వరహాలు తెమ్మని నిర్బంధ పెట్టినాడు మంచిది నేనుయెక్కడనైనా సంపాదించుకొనివచ్చి యిస్తానని వొప్పుకొని నా భార్యాపుత్రాదులను అక్కడవుంచివచ్చినాను నీవు మహాధర్మాత్ముడవు నా ఆపదనివారించవలెను అనిచెప్పగా రాజుతనకుసూర్యుడుయిచ్చిన కుండలములుఆబ్రాహ్మణునికి యిచ్చి వాటిప్రభావము చెప్పి అంపించెను - కాబట్టి అటువంటిసాహసవితరణాలునీకుకలవా అని అడగగాయింతలో తాను నిష్కర్షించుకొన్నముహూర్తము మించి పోయెను గనక భోజరాజుయింటికిపోయెను.

మర్నాడు యెప్పటివలెను ఆ భోజరాజు సింహాసనము యెక్కవస్తూ వుండగా పంధొమ్మిదోసోపానమందుండే ప్రతిమ భోజరాజును చూచివో రాజా విక్రమార్కునికి గలిగిన సాహసాది గుణములు కలవాడేకాని అ

స్వ్యడు యీసింహాసనము యొక్క గూడదు ఆయన గుణము లెటువంటివి వర
చెప్పు తానువినుమనియిట్లనియె.

విక్రమార్కమహారాజు రాజ్యపాలనచేస్తూవుండగావసంతుడనేబో యవాడువచ్చివకడేగను తెచ్చివిక్రమార్కునికి కానుకయిచ్చి దర్శనముచే సుకొనిఅయ్యా నేనుయెనభైయేండ్లవాణ్ని అయినానుభూమిఅంతా వేటలాడి నాను నేనుయిటువంటివింతయెన్నడున్నుచూడలేదువిననున్ను లేదు యేమం టేయెక్కడిదోవకపందికొండవలెపెరిగివున్నది-యెప్పుడంటేఅప్పుడుబోయప ల్లెలమీదవచ్చిపడియిండ్లంతాపాడుచేస్తుందిపొలములోయేమిపైరుపెట్టుకొ న్నప్పటికిన్నిబొత్తిగాగుద్దలించివేస్తున్న అగుపడ్డవారినితరుముకవస్తుందిదా న్నిబాణముతోవేతామనిగురిపెట్టివేస్తే ఆగురికినిలవకమాయమైపోతుంది అ నగా రాజువిని ఆశ్చర్యపడి ఆ బోయను వెంటబెట్టుకొని అడివికి పోయి కనిపెట్టుకొని వుండగా పందివచ్చెను దాన్ని విక్రమార్కుడు త రుముకొని పోగానే అది వొక పర్వతపు గుహచొచ్చెను దాన్ని వెంబడిం చిరాజున్ను గుహచొచ్చెను అదిరాజుకుఅలుపురాకుండామెల్లమెల్లగాపా తాళలోకానకుపోయెను రాజున్నుదాని వెంటపోయిభోగవతీ పురముచొచ్చె టప్పుడువొకపురుషుడుయెదురుగావచ్చిదేవరవారినిబలిచక్రవర్తిపిలుచు కరమ్మనెనుయీవేళకుఆయనయెదురుగావస్తూవుండునుఅనగాఆశ్చర్యప డిఆమనిషితోకూడాపోయియెదురుగావచ్చినబలిచక్రవర్తికిసాష్టాంగదం డప్రణామంబులుచేసెను- అప్పుడుబలిచక్రవర్తి విక్రమార్కునిచెయి త నచేత పట్టుకొనితన సింహాసనము దగ్గిరికి తీసుకొని పోయి అర్ధాసనానకూ చుండబెట్టుకొనెను - మును పురంభోర్వసుల నాట్యమువల్లదేవేంద్రు ణ్ని చూస్తిని - యిప్పుడు యీవరాహము నిమిత్తమై వచ్చి మిమ్మునుచూస్తి ని - నేనుకృతార్థుడనైతిని - నీవు విష్ణువుకు భూదానమిచ్చిన పుణ్యశాలి వి నీదర్శనంయెంతటి వారికి కలుగును నేడునాకుసుదినమనివిక్రమార్కుం

ష్ఠురింగాస్తోత్రము చేయగా బలిచక్రవర్తి సంతోషించినీవు భూలోకము
నుండి దుష్టులనందరినిన్ని శిక్షించి శిష్టులనురక్షించిఅడిగినవారికెల్లా అవ్వారి
గాధనమిచ్చి కీర్తిబొంది రాజ్యముచేస్తూవుండే సమాచారము విని నిన్ను
చూడవలెనని పిలువనంపితిని అని చెప్పి రెండు రత్నాలు తెచ్చి యీరత్నా
లుకోరినవస్తువులనిచ్చును నీవు తీసుకొమ్మనివిక్రమార్కునికి బహుమా
నము చేసి తనమనిషిని కూడాయిచ్చి యీపాతాళ లోకమునుంచిభూలో
కానికి పిలుచుకపోయి విడిచిపెట్టిరమ్మని ఆమనిషితో చెప్పి విక్రమా ర్కు
నికిశెలవు యిచ్చి అంపించెను - తర్వాత విక్రమార్కుడు బలిచక్రవర్తి
అంపినమనిషితోకూడా భూలోకానికి వచ్చి ఆమనిషికిశెలవిచ్చిఅంపి తనప
ట్నాముదోవ బట్టివస్తూవుండగా వొకముసలిబ్రాహ్మణుడు తొంభైయేం
డ్లవాడు తన కొమారుణ్ని పిలుచుకొనివిక్రమార్కునివద్దికి రావలెనని వ
స్తూవుండి దోవలో విక్రమార్కుణ్ని చూచి అయ్యా విక్రమార్కుడు వుం
డే పట్నముయింకాయిక్కడికి యెంత దూరమున్నది అనిఅడగగానే నే
విక్రమార్కుణ్ని యెందుకు వచ్చినావు అనిఅడిగెను - అయ్యా నాకు లే
కలేక వొకకొమారుడుగలిగినాడు - వీడేను - నేనువృద్ధునయినాను - వీని
కిపెండ్లి చేశికన్నులచూతామని అపేక్ష నిండావున్నది అయితే మహాదరి
ద్రుణ్ని నా నాటికి భోజనానికి సంపాదించుకోవడమే ప్రయాస పెండ్లి
చేశేటందుకు యెక్కడా వక దమ్మడి దొరకలేదు - పెండ్లిఖర్చుకు సంపా
దించుకొంటే పడుచునిచ్చేమని అనేకమంది సిద్ధముగా వున్నారు నీవేమై
నాయీకార్యానికి కొంచెము గొప్పల సహాయపడగలవా అనేకమందికినీ
వుబహుయిచ్చినావనివినివచ్చినాను నేనుఅంతదూరము నడిచి పోసుండాదై
వాధీనముగానీవుయిక్కడనే అగుపడితివి నిన్ను చూస్తిని నేనుకృతార్థు
డనైతిని - అనిబహువిధములుగాస్తోత్రము చేయగా రాజుతనకు బలి చ
క్రవర్తియిచ్చినరత్నాలు రెండున్ను ఆబ్రాహ్మణునికియిచ్చి వాటిప్ర

భావము చెప్పి అంపించెను - కాబట్టి అటువంటి వితరణ సాహసాలు నీకుకలవా అని అడగగానే యింతలో తాను నిష్కర్షించుకొన్న వేళ తప్పిపోయెను గనక భోజరాజు యెప్పటివలెనే తిరుగా యింటికిపోయెను.

ఇరువయ్యో సారి భోజరాజు మంచి వేళ విచారించుకొని సింహాసన మెక్కవలెనని వస్తూవుండగా యిరువయ్యో ప్రతిమ అతణ్ని చూచిఅయ్యా నీవు యీ దేవతా నిర్మితమైన వరత్న ఖచితమైన సింహాసనము యెక్కవలెనని బహు సంతోషముగా ఆయత్తపడివస్తున్నావు నీవంటి వారెల్లా యిది యెక్కేటందుకు యోగ్యులు కారు విక్రమార్కుని వంటి వారైతే యోగ్యులు ఆయనగుణములు చెప్పుతానువినుమని భోజరాజుతో యిట్లనియె.

విక్రమార్కుడుభూసంచారము చేసే కాలములో వక నాడు అతనివద్దికి నలుగురు సిద్ధులు వచ్చిరి - వారినిచూచి విక్రమార్కుడు అయ్యా మీరుయేయే దేశములు చూచినారు యేయే నదులలోస్నానము చేశినారు యేయేపుణ్యస్థలములు సేవించి నారు యిప్పుడు యెక్కడనుంచి వస్తున్నారు యిక్కడనుంచి యెక్కడికి పోతున్నారు అని అడిగెను - మేము సకలమైన దేశములున్ను తిరిగినాము సకలమైన నదులలో స్నానము చేసి నాము సకలమైనపుణ్యస్థలాలున్ను సేవించి నాము సకలమైన మహానుభావులదర్శనము చేసుకొన్నాము - అయితే మంచుకొండమీద పన్నగాటవిలోనుండే సిద్ధయోగీంద్రుని చూడమైతిమి అక్కడవిస్తారంగా పాములున్నుమంచు గడ్డలున్ను వుండును గనక మాకు అసాధ్యమయి నది యిప్పుడు మేము ఆహిమవత్పర్వతము దగ్గిరనుంచివస్తున్నాము యిట్లాదక్షిణంగా పోవలెనని వచ్చి నాము అని చెప్పగా విక్రమార్కుడు తత్క్షణమే లేచి మంచుకొండకుపోయిపన్నగాటవిలోచొచ్చి పోతూవుండగా పాములు లెక్కలేకుండా అత

ని దేహానచుట్టుకొనె నా అందుకుభయ్యపడని వాడై మంచుగడ్డలు కరగ తొ
క్కుకొంటూ పోగాపోగా సిద్ధయోగీంద్రుడు అగపడెను అతని సమీపాన
కు పోగానే దేహమందుచుట్టుకొన్న పాములన్నిన్ని వదలి పారిపోయెను .
అంతట ఆమహాపురుషుడు విక్రమార్కుని చేత నమస్కరించబడ్డవాడై లే
చివిక్రమార్కుని కౌగలించుకొని కూచుండబెట్టుకొని నీవు మనుష్య మా
త్రుడవు గావు మనుష్యుడవైతే యిక్కడికి రాలేవు నీవు మహానుభావుడ
వు నీవు యెవరు నీపేరేమి నీవు యిక్కడికి వచ్చినకార్య మేమని అడుగగా
నేను ఉజ్జయినీనగరమునేలే రాజును నాపేరు విక్రమార్కుడు మిమ్ములను
చూచి పోదామని వచ్చినాను అనిచెప్పెను - అనగాఆసిద్ధయోగీంద్రుడు
సంతోషించి ఆరాజుకు వక బలపమున్ను వొక బొంతానున్ను వకలాతాపు
కోలాన్ను యిచ్చి యేజంతువైనా నీకు కావలశి వుంటే యీ బలపాన
వ్రాశి యెడమచేత లాతాపు కోలతీసుకొని తాకిస్తే ఆజంతువుకు ప్రాణం
వచ్చి లేచును - యేజంతువైనా నశించవలెనని నీవుతలిస్తే వాబలపాన ఆజం
తువును వ్రాశి కుడి చేత లాతాపుకోలతీసుకొనితుడిస్తే ఆజంతువునశించు
ను - యీబొంత విదిలిస్తే కోరిన ధనంకుప్ప బడును ఇవి తీసుకొనిపోయి ర
మ్మనగా ఆసిద్ధుని వద్దినుంచి విక్రమార్కుడు తిరుగా వస్తూవుండే సమయ
ములో మనుష్య సంచారములేని అడివిలో వకడు కట్టెలుపిరుస్తూ వుండగా
వాణ్ని పిలిచి నీవు కట్టెలకు గాను యింతదూరం యేవూరినుంచివస్తివి మీ
వూరి దగ్గిర అడివి లేదా అని అడిగెను - వాడు రాజుకు మ్రొక్కి తానుతూ
పు దేశము యేలే రాజుబంటును ఆరాజుపగవారిచేత రాజ్యము కోలుపో
యి జగడములోచచ్చెను తర్వాత ఆయన కొమారుడు నన్ను వకణ్ని వెం
టబెట్టుకొని పట్నము విడిచి యీ అడివికి వచ్చినాడు యిన్నాళ్లు రాజ్యము
యేలి యికను భిక్షమెత్తుకొని తిరిగే బ్రతుకు యెందుకని అగ్ని ప్రవేశమ

న్యేటందుకు ప్రయత్నపడినన్ను కష్టాలు విరుచుకొనిరమ్మనగా [illegible] ప్తినీనే నున్ను ఆయనతోగూడా అగ్నిప్రవేశమవుతాను అనిచెప్పెను. విక్రమార్కుడు ఆరాచకొమారుడివద్దికి పోయి రాజులకు జగడానపడేది ఉత్తమం లేదా తమ్ము జయించినవారిని వారికి శత్రువులైనవారితోగూడుకొని మరికొన్నాళ్లకైనా సాధించవలెను యిటువంటి కార్యాలు చేతురా అనగా ఆరాచకొమారుడు తన అదృష్టమీలాగున వుండగా యేమి చేయవచ్చునని అంగలార్చెను - అప్పుడు రాజు ఆచిన్నవాణ్ని ఆదరించి కన్నుల నీళ్లు తుడిచి వెళ్లు దువ్వి నీవు యేలఅంగలార్చేవు నీకువచ్చినకొదవయేమి నీవు అధైర్య పడవద్దు యిదిగో యివి తీసుకొమ్మని తాను తెచ్చిన బలపమున్ను లాతాపు కోలానున్ను బొంతాను యిచ్చివాటిమాహాత్మ్యము చెప్పి ఆ రాచకొమారుని చేతనే బలపముతో చతురంగబలాలు వ్రాయించి యెడమచేత లాతాపు కోల మోపించెను - ఆచతురంగ బలాలున్ను ప్రాణము వచ్చి లేచి సంచరించసాగెను తర్వాత బొంతవిదిలించుమనెను విదిలించగానే అతడు కోరినప్రకారం తొమ్మిది కోట్లధనము కుప్ప బడెను - తర్వాత వో రాచకొమారుడా యీచతురంగ బలాలున్ను యీధనమున్ను వుంచుకొని నీపగవారిని జయించి నీవు సుఖముగా రాజ్యము చేస్తూవుండుమని చెప్పి విక్రమార్కుడు తననగరానకు పోయెను - కాబట్టి అటువంటి వితరణ సాహసాలు నీకు లేవు పొమ్మనగా యింతలో లగ్నము తప్పెగనక ఆదినం భోజరాజు యింటికి పోయెను.

తిరుగా మరి వొక నాడు పంచ మహా వాద్యములు మోయగా చాలా సంతోషముతో సింహాసనము యెక్క వచ్చే భోజరాజును చూచి యిర్వైయొకటో సోపానమందుండే ప్రతిమ యిట్లనియె.

వో రాజా యీసింహాసనము యెక్కడానకు సిద్ధమయి వచ్చినావు [illegible]

క్రమార్కునికి గలగుణములు గలిగియేతొక్క వచ్చును అటువంటి గుణాలు
నీకు లేవు ఆయనగుణములెటు వంటివంటి వాని ను విక్రమార్కుడు రాజ్య
ము చేసేటప్పుడు భట్టికి చెలికాడైన బుద్ధి వరుడనే బ్రాహ్మణుని కొమారు
డు సుమతి యనే వాడు తల్లిదండ్రులతో చెప్పక కాశికి పోయి అక్కడ సమ
స్తవిద్యలున్ను చదువుకొని తిరుగా యింటికివచ్చే వాడై యీ కాశీ కడా
కున్ను వకసారిచూతామని చూస్తూవుండగా విశ్వనాథుని గుడికి ఉత్తరము
గా వైక కొలను అగుపడెను ఆకొలనిలో నీళ్లుతుక తుక వుడుకు తూ వుండె
ను - ఆనీళ్లమీదుగా పక్షి పోయినట్టె తేగిరగిరతిరిగి దాంట్లోపడిచచ్చెను -
అదిచూచిఅతడు ఆశ్చర్యపడి యిక్కడ యింకా యేమి వింతలు జరుగునో
అని అక్కడనే వుండెను తర్వాత రాత్రి రెండు ఝామములప్పుడు ఆకొలను
లోనుండి యెనమండ్రు గురుస్త్రీలుబైలువెళ్లివచ్చి విశ్వనాథునిగుడికిపో
యిరి - యీబ్రాహ్మణుడు వాండ్లతోకూడా పోయి గుళ్లో వైక చోట నిలిచి
వుండెను - అంతట ఆస్త్రీలు స్వామి సన్నిధిలో కొంత సేపు నాట్యమా
డి కొంత సేపు గానము చేసి తిరుగా పొయ్యేటప్పుడు యితణ్ని చూచి నీవు
యెవరు యిక్కడయీ వేళప్పుడు యెందుకున్నావు మామీదనీకు అపేక్ష
వుండెనా మాతోగూడావచ్చి ఆవుష్ణోదకపు గుంటలో చొచ్చి రమ్ము అని వా
రుపోయి ఆగుంట లో దుమికిరి అక్కడినుంచి సుమతి తమ యింటికి పోయి తల్లి
దండ్రులను చూచి వారికినమస్కరించి నాటిదినం యింట్లోవుండిమర్నాడు
వుదయాన లేచి విక్రమార్కమహారాజు సభకు వచ్చి రాజును చూచి ఉచి
త స్థలంబుననుపవిష్టుండైయున్న సమయమున రాజుసుమతిని చూచినీవుయె
క్కడెక్కడ తిరిగి నావు యేమేమిచదువుకొన్నావుయేయేవింతలుచూచినా
వు చెప్పుమనగా తానుతిరిగిన చోటున్ను తాను చదివినవిద్యలున్ను చెప్పి త
ర్వాతనువిశ్వనాథునిగుడిదగ్గిరికొలనుసమాచారము చెప్పెను_అదివినిరాజు
ఆశ్చర్యపడి ఆసుమతిని వెంటబెట్టుకొని కాశికి పోయి విశ్వనాథుని సేవించి

డాని దగ్గిరికొలను వద్దికిపోయి నీళ్లు తుకతుకవుడకడంచూచిఅక్కడకనిపెట్టు
కొని వుండగా రాత్రి రెండుఝాముల వేళకుఆకొలనులోనుండియెనమండ్రు
గురుస్త్రీలుబైటికివచ్చిగుళ్లోకి పోయికొంతసేపు స్వామిసన్నిధిలోఆడిపా
డితిరుగావచ్చే సమయములో గుడిముందర వున్న విక్రమార్కుణ్ని చూచి
నీవుయెవరు యీవేళప్పుడు వొంటిగా యిక్కడయెందుకున్నావు మామీ
ది అపేక్ష నీకుకలిగినట్టయితే మాతో గూడా వచ్చి వేణ్నీళ్లకొలనులో చా
చ్చి రమ్ము అని చెప్పి ఆస్త్రీలు అందరున్ను గుంపుగా ఆగుంటలో ధుమికిరి
అప్పుడు రాజున్నువారితోగూడాఅంమలోదుమికి పాతాళలోకానికిపోయె
నుఅక్కడ యీయెనమండ్రు గురుస్త్రీలున్ను విక్రమార్కుని సాహసాని
కిమెచ్చి తమతోకూడా కూర్చుండబెట్టుకొని నీకు యేమి కావలెనని అడిగి
రి నాకు యేమిన్ని పనిలేదు యీలోకముచూతామని మీతోకూడావచ్చినా
ను అనిరాజుచెప్పెను - అంతటఆస్త్రీలు అందరున్ను యీ రాజును వెం
టబెట్టుకొని తమపట్నమందలి వింతలంతాచూపించియెనిమిదిమందిన్ని యె
నిమిదిరత్నాలుయిచ్చి వాటిమాహాత్మ్యమును చెప్పి మునుపు తాము వచ్చి
న మార్గాననే విక్రమార్కుణ్ని పిలుచుకొని పోయికాశీవద్ద విడిచిపెట్టిరి
తర్వాత విక్రమార్కుడు సుమతిని చూచి అక్కడ తానుచూచిన వింతలన్ని
న్ని చెప్పి ఆయెనిమిది రత్నాలున్ను అతనికియిచ్చి సుఖముగా వుండుమని
తన నగరానకు తాను పోయెను - కాబట్టిఅటువంటిగుణాలు నీకు లేవు సీకి
సింహాసనము యెక్కతగదు అనగానాటికి భోజరాజుయింటికిపోయెను.

మర్నాడు భోజ రాజు యెప్పటివలెనే సింహాసనము యెక్కవలెనని
యిచ్ఛచేతను పెద్దలను పిలిపించి వారిని పూజించి శుభ ముహూర్తము
విచారించుమని వారువిచారించి చెప్పిన ముహూర్తమందు సకలాభరణ

ములు ధరించుకొని భేరీమృదంగాది వాద్యములు మ్రోగగా బ్రాహ్మణులు ఆశీర్వదించుచుండగా వందిమాగధులు పొగడగా మంత్రి పురోహితులు మొదలయిన వారితోగూడా దేవనిర్మితమైన సింహాసనము దగ్గిరికి వచ్చి ధూపదీపాదులచేత సింహాసనము పూజించి మహాసంతోషముతో సింహాసనమెక్క బోతూవుండగా యిరువై రెండో సోపానమందుండే ప్రతిమ చూచి అయ్యా విక్రమార్కునికి గల సాహసాది గుణములు కలవాడవో అతడు యీసింహాసనము యెక్కేటందుకు అర్హుడు కడమ వారుయెవరున్ను యోగ్యులుకారు అటువంటిగుణములు నీకువున్నవోలేవో నాకు తెలియదు ఆయనగుణములు నేను చెప్పుతున్నాను వాటిని విని అటువంటిగుణములు కలవాడవైతే యెక్కు లేకుంటేయెక్క వద్దు అనిభోజ రాజుతో యిట్లనియె.

విక్రమార్కుడు పూర్వమందు తపస్సు చేసి వెయ్యేండ్లు రాజ్యమేలేట్టుగా వరము తీసుకొని వచ్చి నాడు ఆమాట భట్టివిని నేనొక వెయ్యేండ్లు ఆయుస్సు యిస్తినని తీసుకొమ్మని విక్రమార్కునితో చెప్పెను - నీవు యెట్లాయివ్వగలవు అని విక్రమార్కుడు అతణ్ని అడిగెను నీకు వెయ్యేండ్లు రాజ్యభారము చేసేటట్టుగదా వరము వున్నది ఆరు నెలలు రాజ్యమేలి ఆరు నెలలు భూసంచారము చేస్తూవుంటే వెయ్యేండ్లు రాజ్యము చేయడం ముగిశేవరకు వెయ్యేండ్లు భూసంచారము చెయ్యనవుతున్నది కూడా ఆయుస్సు రెండు వేలయేండ్లు అవుతున్నది అనిచెప్పగా భట్టి ఉపాయానకు మెచ్చి సంతోషించి విక్రమార్కుడు ఆప్రకారమే చేస్తూవుండెను కాబట్టి వొక సారి భూసంచారానికి పోయినప్పుడు అక్కడక్కడి వింతలు చూస్తున్న విదర్భ దేశానకు పోయి వొకవూళ్లో దిగి ఆదినము అక్కడ వుండి మరునాడు మరి వొకవూరికి పోతూవుండగా మార్గములో వొక ఉద్యానవనమున్ను కొలనున్ను గుడిన్ని అగుపడెను యీ విక్రమార్కుడు ఆ ఉద్యానవనములో కొంత సేపు కూర్చుండి శ్రమతీర్చుకొని కొలనులో స్నానము చేసి గుడికి పోయి

ఆగుడిలోవుండేదుర్గను సేవించితిరుగావచ్చే టప్పుడు ఆగుడిలో వొకమం
టపములోకూచుండి జపము చేస్తూవుండే బ్రాహ్మణ్ని చూచి ఆయన జ
పముముగిశేవఱ్ఱకు అక్కడవుండి జపముచాలించగానేఆయనకుమ్రొక్కి అ
య్యా మీరుయెవరు మీ పేరేమి యెక్కడనుంచివచ్చి నారుయెన్నాళ్లనుం
చియెవరిని గూర్చి యేమి నిమిత్తము యిక్కడజపముచేస్తున్నారు అని అడ
గగా ఆబ్రాహ్మణుడు యీరాజునుచూచి అయ్యా నేనుకాంచీనగరములో
నుంచి వచ్చి నాను సత్యశీలుడనేబ్రాహ్మణునికొమారుణ్ని నాపేరువ్రత
శీలుడు నేనురసవాదము సిద్ధించే నిమిత్తము కాంచీ నగరములో కామాక్షు
మ్మను గూర్చి పంథ్రెండేండ్లు జపముచేస్తిని అప్పుడుఆదేవి నాకుప్రత్యక్షు
మై యీదుర్గనుగూర్చిజపముచేస్తేసిద్ధించునని చెప్పెనుతర్వాతయిక్కడికివ
స్తినియిక్కడికివచ్చిపంథ్రెండేండ్లాయెను నాటినుంచియీదుర్గను గూర్చి జప
ముచేస్తున్నాను యిదివరకుప్రత్యక్షము కాలేదునామీదదుర్గకుకటాక్ష
మున్నదోలేదో తెలియదుఅనిచెప్పెనుయీమాటలన్నివిక్రమార్కుడువిని
బ్రాహ్మణుని మీద కరుణబుట్టి మంచిదియెట్లాగైనా యీబ్రాహ్మణునికో
రికె నెరవేర్చవలెనని తలచిఆదినముఅక్కడనిలిచెనుఆరాత్రిరాజుస్వప్నము
లోదుర్గవచ్చి రాజా నీ వెందుకుయీపనికిపూనుకొన్నావునీకుమనసులోపు
ట్టిగా యీబ్రాహ్మణునికోరికె నెరవేర్చవలెననివుంటే నీగుణములవంటి
గుణములు గలరాజు కంఠముతుంచినాకుబలియిచ్చినట్టయితే యితనికోరికె
నెరవేరుస్తున్నాను - అనిచెప్పెను - అంతటరాజు మేల్కొని ఉదయానలే
చిస్నానము చేశియెట్లాగైనా యీతనికోరికెతీర్చడమే ముఖ్యము - నా
వంటిగుణములు గలవాడు నేనే కాని మరియెవరున్ను లేరు వొకవేళయెక్క
డనైనా వుండిరి బో వారిని మనము యీ పనికిరమ్మంటే వత్తురా కాబట్టి
బ్రాహ్మణుని నిమిత్తము నా కంఠము దుర్గకు బలియిస్తానని తెంపు చేశిడు

గణసన్ని ధిలోతన చేతిఖడ్గాన శిరస్సు ఖండించుకోబొయ్యే సమయాన వోరాజా నీవు శిరస్సు ఖండించుకోవద్దు నీసాహసానకు మెచ్చి తిని వర మడుగు యిస్తానని దుర్గ పలకగా నాకు యే వర మున్న వద్దు - యీబ్రాహ్మణునికి రసవాదము సిద్ధించేటట్టుగా అనుగ్రహించుమని విక్రమార్కుడు పలికెను - అప్పుడు దుర్గ ఆప్రకారముగా నేరస వాదము సిద్ధించేటందు కోసరము బ్రాహ్మణునికి వొక ఘుటిక యిచ్చెను - ఆయన అది తీసుకొని విక్రమార్కుని చేత శెలవు తీసుకొని తనవూరికి పోయెను - కాబట్టి అటువంటి సాహసము నీకు గలదా అనగా యింతలో సుముహూర్తము మించిపోయెనుగనక భోజరాజు యింటికి పోయెను.

యిరువైమూడో సారి భోజరాజు తిరుగా సింహాసనము యెక్క వస్తూవుండగా యిరువైమూడో సోపానమందుండే ప్రతిమ చూచి విక్రమార్కుని గుణాలు నీకు కలిగివుంటే యీసింహాసనము యెక్కు ఆయన గుణాలు యెటువంటి వంటివా చెప్పు తాను విను మని యిట్లనియె.

విక్రమార్కుడు భూసంచారము చేశేటప్పుడు మాళవదేశాన అడివిలో వస్తూవుండగా అక్కడ ఆవు అంభోయని అరిచెను ఆధ్వని విని యిదిమహారణ్యము యెక్కడా పశువులమంద లేదు యీధ్వనికి కారణమేమి అని వెతుకుతూరాగా ఆయావు రొంపిలో నాలుగు కాళ్లు దిగబడి కదల మెదల గూడకవుండెను విక్రమార్కుడు దాన్ని చూచి దయవచ్చి లేవనెత్తవలెనని తలచి ఆవు దగ్గిరికి పోయి లేవనెత్తబోగానే ఆరొంపిలో తానున్ను దిగపడెను యింతలో ప్రొద్దుగూకెను రాత్రివేళ వురుములున్ను మెరుములున్ను వర్షమున్ను వచ్చెను విక్రమార్కుడు యెంత వురిమినప్పటికిన్ని యెంత మెరిశినప్పటికిన్ని యెంత వానగురిశినప్పటికిన్ని వెరవక యెట్లాగైనా ఆవును రొంపిలోనుంచి లేవదీసి పోదామని మెరసినప్పుడు ఆ వెలుతురున ఆవును కొంచెము కొంచెము గట్టుకు తీస్తున్న వానకు

రిశినప్పుడు పైపై బురదగడుగుతున్నా వుండెను యిట్లావుండగా తెల్లవా
రేవేళ వొక పెద్దపులి వచ్చి ఆవుమీదికి దుమికెను అప్పుడు విక్రమార్కుడు
ఖడ్గముదీసుకొని పెద్దపులినినరికెనుతర్వాత సూర్యోదయానకు మెల్లమెల్ల
గా ఆవును బైటదీసెను అంతట నరికిన పులిన్ని బురదలో నుంచి లేవదీసిన ఆ
వున్ను మాయమైపోయెను - అదిచూచి విక్రమార్కుడు ఆశ్చర్యపడి నిలు
చుండివుండగా ఆకాశాననుండిపుష్పవర్షము గురిశెను ఆగుంటగట్టున కా
మధేనువు ప్రత్యక్షమై వోరాజా నేను కామధేనువును ఇంద్రునిఆజ్ఞవల్ల
నీసాహసముపరీక్షించవచ్చినాను ఉరుములున్ను మెరుములున్ను వర్ష
మున్ను పులిన్ని నామాయచేతవచ్చినవి నేనునీ వెంటవస్తానునన్ను మీాయిం
టవుంచుకొంటివా కోరినకోర్కెలు చేకూడును అనిచెప్పెను - చెప్పగానే
విక్రమార్కుడు సంతోషించి తనతో గూడా కామధేనువును తీసుకవస్తూ
వుండగా వొక బ్రాహ్మణుడు చేత కర్రబట్టుకొని వూతబోడుచుకొంటూ
కన్నులుబాగా తెలియక ఆవువచ్చే చప్పుడువిని వో పసువును వోలుకవ
చ్చే పుణ్యాత్ముడా నామీద పడదోలకుమీ నేను కండ్లగానని వాణ్ని దారి
జాడబట్టుకొని పోతున్నాను అనగా విక్రమార్కునికి దయవచ్చి బ్రాహ్మ
ణుడిదగ్గిరికి పోయి నీవెవ్వరుయెక్కడికిపోతున్నావుయెక్కడనుంచివస్తున్నా
వు అని అడిగెను - నేనుగంగాతీర మందుండే బ్రాహ్మణుడను నాకు తొం
భై తొమ్మిదియేండ్లు అయినవి కండ్లుపొరలు గప్పినందున బాగా అగుపడవు
చెవులు వినరావు పండ్లన్నీ వూడిపోయినవి దేహములోబలములేదు నడవ
లేను యిన్ని దినములున్ను బాగా బ్రతికినాను యిప్పుడు కష్టదశ వచ్చినది
కాబట్టివిక్రమార్కమహారాజు అర్థులపాలిటికల్పవృక్షమనిచెప్పగావి
ని ఆయన వద్దికి పోదామని పోతున్నాను నాకు అడుగు ఆమడగావున్నది
యింకావిక్రమార్కుడువుండేచోటుయిక్కడికియెంతదూరమున్నది అని ఆ

డగగా ఆబ్రాహ్మణ్ని చూచి నేన్నీవిక్రమార్కుణ్ని నా వద్ద యిప్పుడు వక ఆవువున్నది - దాన్ని యిస్తున్నాను నీవుకోరిన కోరికలు చేకూడును అని చెప్పి కామధేనువును చూచినీవు నామీదదయచేశి బ్రాహ్మణునితోగూడా పోయిఆయనకు కావలశిన కోరికలు నెరవేరుస్తూవుండుమని ప్రార్థించి బ్రాహ్మణునికి శెలవుయిచ్చి అంపించెను విక్రమార్కుడు ప్రార్థించిన ప్రకారము కామధేనువు బ్రాహ్మణుడితోగూడాపోయిఆయనను సుఖపెడుతూవుండెను కాబట్టి అటువంటి సాహస వితరణాలునీకు గలవాయన గాతిరుగా భోజరాజు యింటికిపోయెను.

యిరువైనాలుగోసారిసింహాసనమెక్కవచ్చే భోజరాజును చూచివిక్రమార్కుని కంటేయుతరుడు యీసింహాసనమెక్కవలెనంటేఆవిక్రమార్కునికి గలిగినటువంటిగుణాలు వుంటే నేయెక్కవలెను లేకుంటేయెక్కగూడదు ఆయనగుణములు యెటువంటి వంటేవిక్రమార్కుడు రాజ్యము చేశే కాలములో వొకనాటిరాత్రి వొకకలగనిమర్నాడు ప్రొద్దున నే కొలువు కూటానికి వచ్చి పెద్దలను రావించి అయ్యా నేను రాత్రి యెర్రనిపూలదండ వేసుకొని యెనపోతు నెక్కి దక్షిణపుదిక్కుకుపొయ్యే టట్టుకలగంటిని యీ కలకు ఫలమేమని అడగగా అందులో వొక బ్రాహ్మణుడుయిట్లనియె - అయ్యా నాకు స్వప్నాధ్యాయమువచ్చును - మునుపువక రాజు కొంచెపాటి గట్టునుంచి పాడు గాటిపర్వతము యెక్కినట్టు కల గని నాతోచెప్పెను నేనుస్వప్నాధ్యాయము చూచిఆకలఫలము తెలుసుకొని యిప్పుడుయేలే దేశము గాక యింకొక దేశము రాగలదని చెప్పితిని - ఆయనకు అట్లాగేఫలించెను - యిది భట్టిన్ని యెరుగును అనగా భట్టి అవునని చెప్పెను అయితేయిప్పుడు నేనుకన్నకలకు ఫలమేమనిఅడిగిన విక్రమార్కుని చూచిఅయ్యాయిదిదుస్స్వప్నముయిందుకుపరిహారముబంగారముతోయెనపోతును చేయించిశాస్త్రోక్త

ప్రకారముగా దానికి దక్షిణబెట్టి దానము చేసి యీవరకు బొక్కసాన వుండే ధనమంతా యాచకులకు పంచిపెట్టవలెను అని బ్రాహ్మణుడు చెప్పెను. అప్పుడు బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారముగా దున్నను చేయించి తగిన దక్షిణ బెట్టి దానము చేసెను - కడమ బొక్కసములో వుండే ధనమును యావత్తున్ను అవ్వారిగా యాచకులకు పంచిపెట్టెను - ఉజ్జయినీ నగరానకు చుట్టుపట్టు యిరువై ముప్ఫై ఆమడలో వుండే వారెల్లా మహాభాగ్యవంతులయిరి కాబట్టి అటువంటి వితరణము నీకు గలదా అని అడగగా యింతలో తాను నిష్క్రమించుకొన్న వేళ తప్పెను గనక భోజరాజు తన యింటికి పోయెను.

మనాఁడు భోజరాజు యెప్పటివలెనే సకలాభరణభూషితుడై సింహాసనమెక్కేటందుకు వేళ విచారించుకొని మంత్రి పురోహిత సమేతుడై బ్రాహ్మణులాశీర్వదించగా సింహాసనము దగ్గిరికి వచ్చి యిష్టదేవతా ప్రార్థన చేసుకొని సింహాసనము యెక్కబోగా యిరువై అయిదో సోపానమందుండే ప్రతిమ చూచి-వోరాజా విక్రమార్కునికి గల సాహసాది గుణాలు కలవాడవైతే యీ సింహాసన మెక్కేటందుకు తగుదువు లేకుంటే తగవు ఆయన గుణములెటువంటివంటే చెప్పుతాను విను.

విక్రమార్కుడు భూసంచారం చేసేటప్పుడు మంచుకొండ దగ్గిర చంద్రవతీ పురమనే పట్నము చేరి ఆ పట్నములో యీశ్వరుని గుళ్లోకి పోయి యీశ్వరుణ్ని సేవించి అక్కడ కూర్చుండి వుండగా నలుగురు మనుష్యులు మంచిబట్టలు గట్టుకొని మంచి సొమ్ములు పెట్టుకొని వెంట కొంతమంది యాచకులు రాగా సంగీతగాండ్లు సంగీతము పాడగా భోగము వాండ్లు ఆడగా భట్టువాండ్లు పొగడగా అడిగిన వాండ్లకెల్లా రెండు మూడు యిస్తూ గుళ్లోకి వచ్చి స్వామిని సేవించినారు యింటికి పోయి తిరుగా మనాఁడు ఆ నలుగురిలో నొక్కడు వెర

టమనిషి లేక పైకిబట్టలేక చినిగిపోయినటువంటి వుంటిగుడ్డ గట్టుకొనిగుడిలో కిరాగా విక్ర మార్కుడు చూచి ఇతడు నిన్న దొరతనముగలవాని వలె నేవచ్చినాడు నేడుదొంగల చేతదోపిడిపోయినవానివలె నేవున్నాడు యిదియేమో నని అతణ్ని దగ్గిరికిపిలిచి అన్నా యిది యేమి నీవు నిన్న వచ్చి నవిధములో నేడు వచ్చి నవిధములో. శానావ్యత్యాసమువున్న ది అని అడగగా అతడు అయ్యా నేను జూజమాడేవాణ్ని జూజాన నేను సంపాదించిన ధనము యింత అంత అనిచెప్ప గూడదు - పోగొట్టిన ధనమున్ను లెక్కలేదు అనెను అప్పుడువిక్ర మార్కుడు అతణ్ని చూచినాయి వెఱ్ఱివాడా నల మహారాజుధర్మరాజు జూదమాడిమోసపోయిన తెరంగెరుంగవా నీవు యిక మీదజూదమాడవద్దు నీకుతగినటువంటి కొలువుగొల్చి బ్రతుకు మన గాజూదరివిక్రమార్కునితో యిట్లనియె.

అయ్యా జూదమాడవద్దు దానివల్ల చెడి పోదును అనిచెప్పి తివి నలమహారాజు ధర్మరాజు న్యాడిపోతే వారినిజయించినవారు ఐశ్వర్య మనుభవించ లేదా కాబట్టిజయము వకనికివస్తే అపజయం వకనికి వస్తున్నది దైవము సహాయముగా వుంటే అన్నిన్ని అనుకూలముగా వచ్చును - దైవము సహాయముగావుండకుంటేసమస్తమున్ను ప్రతికూలముగావచ్చును.

అదియేలాగంటే ఘూర్జ మురల్లా పతియను పట్నమందు విజయసేనుడను రాజుగలఁడు అతనికిఁ గాంతిమతియను పెండ్లాముకు యిద్దరికిమతిమంతుఁడనుకొమారుడుపుట్టెనుకొన్ని దినములకు విజయసేనుండును నతని భార్యయుంబంచత్వంబునొందిరితర్వాతమంత్రులుమతిమంతునికిం బట్టంబు గట్టిరంతనతఁడు రాజ్యము సేయుచుండెనప్పుడుజ్యోతిషము బాగు గాఁ దెలిసిన వాఁడొక బ్రాహ్మణుడువచ్చెనుఅతనియొద్దమతిమంతుడు డన జాతక

మునిచ్చి చూచుచు నేను - అప్పుడా బ్రాహ్మణుడు రాజు జాతకము జూచి
యయ్యా నీకుం ఘోర దండన వచ్చు నని రాజుతోఁ జెప్పెను - అప్పుడా రా
జాశ్చర్య పడి యోరి వెఱ్ఱి వాఁడా నేను రాజ్యము సేయు వాఁడను నాకుఁ
ఘోరదండన యెట్లు వచ్చునని యడిగెను - అయ్యా యీ ఫలము సిద్ధముగా
నీవనుభవించెదవు తప్పదని రాజుతోఁ జెప్పెను - మంచిది యీ బ్రాహ్మణుం
డిట్లు చెప్పినాఁడు గదా యిది పరీక్షింతమని యెంచి రాజ్యము మంత్రులయ
ధీనము సేసి తానొక యరణ్యంబునకుం బోయి యక్కడ నొక వట వృక్షము
క్రిందం గూర్చుండి తపంబు సేయుచుండెను - ఒకనాఁడు దొంగలు మం
దారపుర మేలెడు రాజునింటం జొఱబడి సొమ్ములన్నియుం దొంగిలించు
కొనివచ్చి యామఱ్ఱి చెట్టుదగ్గిరం గూర్చుండి వారందఱు నాదొంగిలించి
న సొమ్ము పాళ్లు పంచుకొని పోఁగా నందులో నొకనగ యక్కడ జాఱి పడి పో
యెను - తర్వాత మందార పురపు రాజు మనుష్యులు దొంగల యడుగుల
జాడం బట్టుకొని యామఱ్ఱి దగ్గిరికి వచ్చి యచ్చట బడి యుండెడు నగ సూ
చితముదని గుఱ్ఱు పట్టి యక్కడం గూర్చుండి తపస్సు చేయుచుండెడు ముని
మంతుని జూచి యిది గోపీఁ డే దొంగ - మనము వచ్చిన జాడఁ దెలుసుకొని తన
కుఁ దప్పించుకొని పోవల్ల లేక తపస్సు సేయు వానింబలె వేషంబు వేసుకొని
కూర్చుండి యున్నాఁడని యతనిం బట్టి కట్టి యా నగతోఁ గూడ రాజు నొద్ద
కుం గొని పోయిరి - అప్పుడా రాజీ తని ముఖ తేజస్సుఁ జూచి రాచ కొమా
రుండని యెంచి చంపింపనిచ్ఛ యుంపక వ్రేలు గోసి వేయుమని యాజ్ఞాపించి
న రాజపురుషుల తనిచిటి కెన వ్రేలు గోసి విడిచి పెట్టిరి - అంత నా వృత్తాం
తం బంతయు నొక కోమటి శెట్టి విను చుండి యతనిం దన యింటికిం బిలుచుకొ
ని పోయి కట్టు గట్టి భోజనము నడిపించి గాయముఁ గుదిర్చెను - తర్వాత
నొకనాఁడు రాచకొమారుఁడు రాజు కొమార్తె యుండెడు మేడకు సమీ
పాన నొక మంటపములోఁ బండుకొని యర్థ రాత్రి సమయంబున లేచి తాఁ
బుట్టిన పుట్టుక యము నుపు తానున్న యుస్థితి యు జ్యోతిషికుఁడు సెప్పిన మాట

లుండానిప్పుడున్నరీతియుండదలపోశి భగవంతునింగూర్చి కొన్ని పద్యములు సే
సిచదివెను - ఆపద్యములు రాజుకొమార్తె విని చెలికత్తెలనంపియతనిం దన
యొద్దకుంబిలిపించుకొనియాపట్టణములోనుండెడులోకేశ్వరుండను స్వా
మిని ధ్యానించియీరాచకొమారునికింగోసిన వ్రేలెప్పటియట్లవచ్చునేని బం
గారుప్రాకారముగట్టించెదనని మ్రొక్కుకొనెను - ఇంతలోనతని వ్రేలె
ప్పటియట్ల మొలిచెను - తర్వాతనాచిన్నదియారాత్రి యతనిం దన మేడమీ
దనుంచుకొని మఱునాడరుణోదయంబునందనతండ్రి దగ్గిరికింబోయి యీ
సమాచారం బంతయు నతనితోం జెప్పి యతనిందనకుం బెండ్లి సేయుమనె
ను - అందుకారాజాశ్చర్యపడియారాచకొమారునిం దనదగ్గిరికిం బిలి
పించుకొని యావర్తమానమంతయు నడిగి తెలుసుకొని తనకొమార్తెన
తనికిచ్చి వివాహము సేసితన రాజ్యమంతయునతనికేయిచ్చెను - కాం
బట్టి యిప్పుడునాకు దైవమనుకూలముగా నుండలేదు గాన జూదములో
నోడిపోయితి దైవమనుకూలమయినప్పుడు తిరుగా నేను గెలిచెదననియీ
ప్రకారము సెప్పుచుండంగా నచ్చటికిద్దరుపర దేశులు వచ్చి మన మన్ని
చోట్లనుసంచరించి యన్ని వింతలుం జూచితిమి యింద్రకీలపర్వతముదగ్గిర
నొకశక్తిగుడియున్నదట యెవ్వండేనియుందన యష్టాంగములరక్తముదీ
సియాశక్తికిశిరస్సుననభిషేకము సేసెనేని వానికింగావలయు కోరికలుశ
క్తిప్రసాదమువల్లంగలుగు ననియాగుడిలో నొకశాసనము వ్రాసి యున్న
దటయచ్చటికిమనము పోకపోయితిమని యొకరితో నొకరుమాట్లాడుకొని
రి - ఈమాటలువిక్రమార్కుండువినిజూదరింబిలుచుకొనియింద్రకీలపర్వ
తమునకుం బోయియక్కడశక్తిగుడింజూచి యాసమీపముననుండెడు కో
నేటిలో స్నానము సేసినిత్యకర్మముందీర్చుకొనిశక్తిగుడిసొచ్చి యచ్చటి
శాసనముం జదువుకొనికత్తియొఱ దూసుకొని తనయష్టాంగములు ఛేదిం

చుకొని శక్తి శిరస్సు నందారక్త మభిషేకము సేసెను - అప్పుడు శక్తి యా
సాహసమునకు మెచ్చి రాజునకుఁ బ్రత్యక్షమై యష్టాంగము లెప్పటియ
ట్లుంచు నట్లు చేతనిమిరి రాజానీ సాహసమునకు మెచ్చి తని వర మడుగు
మిచ్చెదనన విక్రమార్కుఁడుఁ జూదరిం జూపించి తల్లీ యితనికిఁ గోరిన వరం
బులిచ్చునట్లు గా వరంబిమ్మనియడిగెను - ఆశక్తి యతఁడు కోరినట్లు వర
మిచ్చెను - కాబట్టి యటువంటి సాహస వితరణంబులు నీకుఁ గలవా య
నిప్రతిమ యడుగఁగా భోజరాజు నాటిదిన మింటికిఁ బోయెను.

మఱునాఁ డరుణోదయంబునఁ దొల్లింటి పోల్కి సింహాసన మెక్కవచ్చు
భోజరాజుం గని యిరువది యాఱవ సోపానము నందలి ప్రతిమ యిట్ల
నియె.

ఓ రాజా విక్రమార్కునికిఁ గల సాహస వితరణములు లేక యీ సింహా
సన మెక్కఁ గూడ దాయన గుణంబు లెటువంటివంటి వేనిం జెప్పెద వినుము-
విక్రమార్కుఁడు భూమి సంచరించునప్పు డొకయడవిలోఁ బోవుచుండగా
నచ్చటి చెంచువాఁడ్రు రాజుం జూచి యడవి పండ్లును - గొయ్యా పం
డ్లును - కిచ్చిలి పండ్లును - పనస పండ్లును - నేరేడు పండ్లును - గసగసా
లును - ఖర్జూరపు పండ్లును - వెలగ పండ్లును - దోసపండ్లును - నిమ్మ
పండ్లును - మామిడి పండ్లును - టెంకాయలుం జెఱుకు తుంటెలును - బా
దము కాయలును - చారపప్పును - వెదురు బియ్యంబునుం దేనియ మొదల
గు వస్తువులు రాజునకుం గానుకగాఁ దెచ్చి యిచ్చి రింతలోఁ బెదవులు వ
డుపుకొను చునిట్టూర్పులు విడుచుచు రోఁజుచు మాటలాడం జాలక నలుగు
రుపరదేసులు పరుగున వచ్చిరి - విక్రమార్కుఁడునకుం జెంచువాఁడ్రు
దెచ్చి యిచ్చిన వస్తువులన్నియు వారిని భక్షించుమని వారి యాయాసము దీర
నిచ్చి పిమ్మట వారిం జూచి యయ్యా మీ రిట్లు రోఁజుచుం బరుగెత్తి వచ్చి న
కారణంబేమి నాతోఁ జెప్పుఁడనిన రాజుతో వారిట్లనిరి అయ్యా యిచ్చటి

కిదాపునమాల్యవంతంబను పర్వతంబుగల గచ్చటనొక గుడిలో శోణిత
ప్రియయను దేవియున్నది యాగుడిముందఱ మేముకూచుండఁగా మా
చెంగటంబట్టు పట్టు కట్టుకట్టుమనుమాటలు వినవచ్చెను-అప్పుడు పూర్వపుచిన
తం గెడు వలెశృంగారించుకొన్న యొక కన్యకమారొద్ది కరుదెంచి మ
మ్ముంజూచియోవెఱ్ఱివాఁడా రాయిక్కడనేలకూచున్నారుమీరిందుం
టిరేని బోయలుపట్టికట్టి తీసుకొనిపోయి యీదేవికి బలియిత్తురుకాబ
ట్టి యిక్కడినుంచి లేచిశీఘ్రముగాఁబొండనఁగాఁ బరుగెత్తివచ్చితి మని
చెప్పిరి - అంతటవిక్రమార్కుఁడు వారినివెఱవవద్దనియాదరించిపంపితా
నుమాల్యవంతంబునకుం బోయిశోణితప్రియగుడిసొచ్చి యద్దేవిని సేవిం
చుచుండు సమయంబుననచ్చటబోయలొకమనుష్యునిం బట్టుకొనిమెడ
నుబూలదండ వేసిమేళగాండ్రతోఁ గూడఁదీసుకొని వచ్చి గుడివాకిటనిలు
పఁగావిక్రమార్కుఁడు సూచివీఁడుబక్కవాఁడు వీనికిరక్తమాంసంబు లెండి
పోయినవి నేటికి నన్ను బలియిండు వీనివిడువుండని బోయలతోఁ జెప్పెను
వాండ్రా రాజుమాట జవదాట వెఱచిమునివాని విడిచిరాజు మెడను బూ
లదండవేసి శోణితప్రియసన్నిధానమునకుం బిలుచుకొనిపోయిరి - అప్పు
డువిక్రమార్కుఁడు బోయలను జూచి యిక మీఁదం జేయవలయునది యే
మనియడిగెను - అయ్యా యిఁక మీఁద మేము మీశిరము ఖండించవలసిన
దనివారు సెప్పిరి - ఆమాటకు రాజుసంతోషించి యాదేవికిఁ బ్రీతిగాఁ
దనశిరంబు తానేఖండించుకొని యెదంగాక యనికత్తి యొఱదూసుకొనితళ
తళమెఱపించి యతిత్వరగాఁ గంఠముపట్టించివేసుకోఁగా శోణితప్రియ
ప్రత్యక్షమై యోరాజా నీసాహసంబునకు మెచ్చితి వరము డుగు మిచ్చె
దనన రాజుసంతుష్టుఁడై నేడుమొదలుకొని నీవు నరబలిఁ బుచ్చుకొనుట
మానవలయు నిదియ నాకువరంబనిపలికె-నా దేవియు నతనిద యాగుణం
బునకు మెచ్చి యతఁడు గోరినట్లు వరమిచ్చె నంతటవిక్రమార్కుఁడు స్వే

చ్ఛగా భూసంచారము నకుఁబోయెను గావున నటువంటి గుణములునీకు లే
వు పొమ్మనఁగా భోజరాజింటికిఁబోయెను.

మఱునాఁడు సకలాభరణ భూషితుఁడై శుభలగ్నమునందు సింహాసన
మెక్కవచ్చి న భోజరాజుం జూచి యిరువది యేడవ సోపానము నందలి ప్ర
తిమ యిట్లనియె.

ఓ రాజా విక్రమార్కునికిఁ గలబుద్ధి కుశలత లేనిమాన వుండీ సింహాస
నమెక్కనర్హుఁడు గాఁడిది దేవనిర్మితమైనటువంటిది - విక్రమార్కుఁ
డు రంభోర్వశుల నాట్యముయొక్క తారతమ్య విచారణనిమిత్త మింద్రస
భకుఁ బోయినపుడు దీనినింద్రుండు విక్రమార్కుని కిచ్చె నది మొదలు గొ
న్ని దినంబులు విక్రమార్కుండీ సింహాసన మెక్కుచుండెఁ దదనంతరం బెవ్వ
రు నెక్క లేదటువంటి గుణములు నీకుంగలిగి యుండెనా యీ సింహాసన మె
క్కవచ్చు నాయన గుణంబు లెటువంటి వన్నం జెప్పెద వినుము - విక్ర
మార్క మహారాజు భూమిసంచరించునప్పు కంచిదేశములో నొక బ్రాహ్మ
ణుఁడు వీధియరుగుప యిం గూచుండి మహాదుఃఖ పడుచుండన తనిం జూచి
యో బ్రాహ్మణుఁడా యేల విచార పడుచున్నా వని విక్రమార్కుఁ డడిగె
ను - నీతోఁ జెప్పి నందువల్ల నేమిపని చక్కఁబడుచున్నది చెప్ప నందున నే
మిపని చెడిపోవు చున్నది నీ చేత నేమవును నీ వేలయడుగుచున్నా వని విచా
రము చేత నలక్ష్యముగా మాట్లాడెను - తర్వాత రాజా మాటలు విని య
య్యా యాపని నావల్లనైననుం గాక పోయిన నొక సారి నేనును విని మెదడా
నం జెడి పోవలయు నది యేమి నీవిట్లె వరితోన యినం జెప్పు చుంటి వేని నీవు
చింతించు కార్యంబు నకొకరు గాకున్న నొకరేనియును పాయంబు సెప్పుదు
రనిన బ్రాహ్మణుండు రాజు దెసం జూచి యయ్యా మా తండ్రి బహు ద్ర
వ్య ముసంపాదించి నే బాలుఁడనై యుండగాఁ బంచత్వంబు నొందె నటుపి
మ్మట నేఁ బ్రబుద్ధుండనై యింటనుండు పెట్టెలన్ని యు శోధించఁగా నాకొ

కచీటి దొఱికెను - దానిలో ఫల్గాని సంవత్సరము చైత్ర శుద్ధ నవమినాడు రాత్రి పది గడియల వేళం బెద్దకంచి గోపురపు మూడవయంతస్తుకుసరిగా మూడు నిలువుల లోతు ద్రవ్వి తాఁబూడ్చి పెట్టి నవరా లయిదు లక్షలని వ్రాసియున్న దినాడుసుత నేటి వరకునువ్యసనపారావారం బీద లేకము నుంగుచున్న వాఁడ నాయన గోపురపు మూడవ యంతస్తుకుసరిగా మూడునిలువు లెటులం త్రవ్వె నెటులం బూడిచిపెట్టె నిది వింత గానున్న దిమఱి యెక్కడనైనను బెట్టి వ్రాయునప్పుడుదప్పు వ్రాసెంగాఁబోలు నయిదు లక్షల వరాలు జాడలేకపోయె నేనేమి చేయుదునని బహుదైన్యం బునంబలికె నంత నారాజు బ్రాహ్మణుఁడు వ్రాసిన చీటి సంకేతము గ్రహించి మంచిది బ్రాహ్మణుఁడా నీవేల విచారపడుచున్నావు నీకైన కొదవయేమి నీరూకలు నే దీసి యిచ్చెదం జైత్ర శుద్ధ నవమి దనుక నూరకుండుము నాటిదినము నీచింత నివర్తించు నని చెప్పెను - అంతటనా బ్రాహ్మణుఁడు సగము విచారము మానియుండెను - తర్వాత చైత్ర శుద్ధ నవమినాడు రాజువచ్చి యతనిం బిల్చుకొని గోపురముదగ్గిరికిం బోయి రాత్రి పదిగడియల వేళ నాగోపురపు మూడవ యంతస్తు నీడయున్న చోటు గుఱుతుపెట్టుకొని యక్కడఁ ద్రవ్వింపఁగాన యిదు లక్షల వరాలు నగపడెను - ఆ వరాలా బ్రాహ్మణునిం దీసుకొమ్మని రాజు యదృచ్ఛాగా భూసంచారము నకుఁబోయెను - కాబట్టి యట్టి బుద్ధికుశలత నీకుం గలదా యనునంతలో ముహూర్తమతిక్రమించెం గాన భోజరాజు దన యింటికిఁ బోయెను.

మఱునాడ నేకులు సామంత రాజులు పరివేష్టించి రాఁగా విద్వాంసులు ప్రసంగంబులు సేయుచుండ దొడరా సకలాభరణ భూషితుండును మంత్రి పురోహిత సహితుండును నై సింహాసనముఁ జేరఁజని దాని లెస్సగాఁ బూజించి యెక్కఁబోఁగా నిరువది యొనిమిదవ సోపానము నందలి ప్రతిమ యిట్లనియె.

విక్రమార్కుం డెక్కినసింహాసనం బెక్కు టకింకొకఁడు దగు నాయటు వంటి రాజీజగత్తు నంగలఁడా యెవ్వ రేనియు నాయన వంటి వా రైనఁగ డాయీసింహాసనం బెక్కనర్హుల గుదు రాయన గుణము లెటు వంటి వంటేనిం జెప్పెద వినుము.

విక్రమార్కుఁడు రాజ్యము సేయు నప్పుడొకబట్టువాఁడువచ్చి తనశౌర్యాదిగుణములు పొగఁడగా విక్రమార్కుఁడు వానింజూచినీవే దేశపువాఁడవునీ పేరేమి యక్కడిసమాచారము లేమియిక్కడికివచ్చినావనియడిగెను- నేను మాళవదేశపువాఁడను- నా పే రుషణేంద్రుఁడుమాళవదేశము నేలువాఁడుజయసేనుఁడను రాజుగలఁడాయన యొకసారితన కొమారునికిం బెండ్లి సేసియాచకులకుందొమ్మిదిలక్షలధనము పంచిపెట్టినాఁడు-అట్టియుదారత్వము గలవాఁడిప్పు డుపరలోక గతుఁడయినాఁడు - ఇదివరకునారాజుమూలముగాజీవించితి నిప్పు డునన్నా దరించు వారు. లేరు నేనుగొప్ప కుటుంబము గలవాఁడను మీకీర్తి విని మిముయాచించ వచ్చి నాను నీవుమహాదాతవని బట్టు పలికెనంత విక్రమార్కుఁడు వాని మాటలకు సంతోషించి యితండిచ్చిన దాతను మఱచు వాఁడు గాఁడని సిండా మెచ్చు కొని జయ సేనుఁడు గొడుకు పెండ్లిలోనందఱికిం బంచి పెట్టి నంత ధనమీవచ్చి న యొకబట్టు కేయిచ్చెను - అతండాధనము దీసుకొనిమిక్కిలిసంతోషపడివిక్రమార్కునిమీఁదన నేకపద్యములు సెప్పి తనయూరికిం బోయెను - కాబట్టి యటు వంటి గుణములు నీకుఁ గలవాయనిప్రతిమపలకఁగా నింతలో లగ్న ము తప్పెఁ గనక భోజరాజు మఱలనింటికిఁ బోయెను.

మఱునాఁడు తిరుగా సింహాసనమెక్క వచ్చు భోజరాజుంజూచి యిరువదితొమ్మిదవసోపానము నందుండుప్రతిమ యిట్లనియె.

ఓ రాజా విక్రమార్కునికిం గలసాహసాది గుణము లెవరికిఁ గలవో

వారలీసింహాసనమెక్క నుందగిన వారు - ఆయనగుణంబు లెట్టివనినఁ దెలిపె దనాకర్ణింపుము - విక్రమార్కుండు భూపాలనం బొనరించునప్పు డొ క దేశమునుంచి యింద్రజాలాది విద్యలు నేర్చిన వాఁడువచ్చి రాజుం జూచియోరాజా నీవు సర్వజ్ఞుఁడవు నావిద్య యొకసారి చిత్తగించవలెన నిచెప్పి నరాజు సమ్మతించి రేపురమ్మనెను వాఁడు నాటిదినము పోయిమఱు నాఁడు చలువదోవతి గట్టుకొని మెట్టపాగఁజుట్టుకొని పూలయంగి దొడు గుకొని సరిగనడికట్టు బిగించుకొని దివ్యమైనసొమ్ములుధరించుకొనితన భా ర్యను వెంటఁబెట్టుకొనివచ్చి రాజుముందఱ నిలుచుండి నేను దేవేంద్రు నిబం టనసహాయ శూరుండను పేరుగల వాఁడ నొక సంగతిలో దేవేంద్రుఁడున న్నుంజులకఁగాఁ జూచుటం జేసి నేనక్కడనుండక వచ్చి తినీమగువ నా భా ర్య పంచశీర్షుఁడను రాక్షసుడొకయూరిలో దేవతలకు ద్రోహము సే యుచున్నాఁడు నేను దేవేంద్రు నివదలివచ్చినవాఁడనైననిన్ని దినములా యనయొద్దనున్న వాఁడంగాన నారాక్షసుని సంహరించి వచ్చెదజగడం బునకుఁ బోవునప్పుడు స్త్రీలం బిలుచుకొని పోవుటయుక్తము గాదు గనక నా భార్యను మీ యింటనుండనిం డేనని జేసివచ్చిన వెనకదీనింబిలుచుకొనిపో యెదనని చెప్పి రాజునుసమ్మతిపఱచియక్కోమలి రాజు నింటను నిచిపోయెనుద ర్వాతఁగొంత సేపటికియుద్ధరంగమునందసహాయశూరుండుపడిపోయెనని రాజునకుసమాచారమువచ్చెనంత వానిభార్యయీసమాచారమువినితన పె నిమిటిపడిపోయెంగావునఁ దానికమీద జీవించవలయునది లేదగ్నిం జొచ్చె దనని నగరుబైలు వెళ్లిచితిపేర్చించుకొనియందులోఁ బ్రవేశించెనది కలియఁ గాలి చల్లారు నంతకు నసహాయశూరుఁడు వచ్చి శత్రువును జయించితి నా భా ర్యనంపితి రేని నేఁబిలుచుకొని పోయెదనని రాజుతోఁ బలికెను రాజామాటలువి నియాశ్చర్యపడిలోఁగడ జరిగిన సమాచారము తనితోఁ జెప్పి నిమిషమాత్రమా

లోచించి మంచిదియగ్ని ప్రవేశమయినవారుండు లోకమునకుం బోయి నీ భార్యంగొని తెచ్చెద నీ విక్కడ నేయుండుమని చెప్పి ఖడ్గపాణియై ప్రయాణోన్ముఖుఁడాయె నంతట వాఁడు రాజుంజూచి యయ్యా నేను నిన్న వచ్చి నయింద్రజాలాది విద్యల వాఁడను నా విద్యఁదమకుఁజూపుటకై యిట్లు చేసితిననఁగా రాజు సంతోషించి వానికి సకల బహుమానములుం జేసెనటువంటి సాహస వితరణములు నీకుఁగలవా యని యడుగఁగా భోజగాజెప్పటియట్లమఱల నింటికిఁబోయెను.

మఱునాఁడు తిరుగా సకల సన్నాహములతోవచ్చి సింహాసనము లెస్సగా బూజించి యిష్ట దేవతారాధ్యానము సేసి సింహాసన మెక్కవచ్చెడు భోజరాజుంజూచి ముప్పదియవ సోపానమునందలి ప్రతిమయిట్లనియె.

ఓ రాజా యీసింహాసనము దేవతలచేత నిర్మింపఁబడ్డది మనుష్యుల చేతఁ జేయఁబడ్డది గాదింద్రుఁడు విక్రమార్కునకిచ్చె నాఁడా యన వంటి గుణములు గలవారైరేని నీ సింహాసన మెక్కవచ్చును నీకటు వంటి గుణములు గలవో లేవో నాకుఁదెలియదాయన గుణములఁదెలిపెదం జెవినిడుము

విక్రమార్కుఁడు భూపాలనంబు సేయు సమయంబున నొక కాపు వానికి నలుగురు కొమాళ్లు గలిగిరి వాఁడు మృతిబొందునప్పుడు దన కొమాళ్లను బిలిచి మన తూరుపింటిలో నడ్డగోడకింద నాలుగు వేల వరాలున్నవవి మీరు నలుగురును సరిగాఁబంచుకొండని చెప్పెను పిమ్మట నానలుగురిలో నొకఁడు గడమ ముగ్గురికిం దెలియకుండ నాధన మంతయుం దీసు కొని దాఁచుకొనెనంతట మఱికొంతగాలంబునకు నన్న దమ్ములందఱు గూడి తండ్రి సెప్పిన చోటఁజూచియచ్చట నేమి యుంగానక నీవెత్తుకొంటివి నీవెత్తుకొంటివని వారిలోవారు జగడమాడుచు రాజు దగ్గిరికి వచ్చి మొఱపెట్టుకొనిరప్పుడు రాజు వారిమాటలన్నియు నాలకించి ధనమెత్తుకొన్న వానినిర్ణయించ

వలెనని యెంచివారింజూచి మంచిది మీరు జగడముమానియుండుఁడు నాకుఁ దీరినప్పుడు నేనీవ్యవహారమును దీర్చెదనని చెప్పెను మఱికొన్ని దినములకుఁదాను సభలోనుండునప్పుడు వీరు నలుగురును సభలోకి వచ్చి యుండఁగా నేనొకకథఁ జెప్పెద వినుండని విక్రమార్కుఁ డిట్లనియె.

ఒకరాజునకొకకూఁతురుగలిగెనది బహుచక్కనిది యారాజు దానిం జదవ నంపె - నాచిన్నదియన్ని విద్యలుం జదువుకొని తర్వాత గురుదక్షిణయివ్వంగోరి యొకబంగారుపళ్లెరంబులో మంచివస్త్రంబులును వెలలని యాభరణంబులును - బహుద్రవ్యమును నుంచుకొని తన గురువు నొద్దకుం గొనిపోయి యయ్యా నేనుమీకు గురు దక్షిణ యిచ్చెదను మీరు దీసుకొన వలయునని సాగిలపడి మ్రొక్కెను - దాని గురువు చూచి యివియన్నియు నాకెందుకు మీతండ్రి నాకు సకలవస్తువులిచ్చి నడిపించుచున్నాఁడు నీవు దెచ్చినవన్నియు నీవు తిరుగాఁ గొంచుపొమ్మనెను - అయితే నాకి యేమి కావలయునని యాబిడ గురువునడిగెను - నాకేమియుం బని లేదు నీ పెండ్లి రేపనఁగా నీవు నాకు సమాచారమంపి తేని నేనపుడు నిన్నొక టియడిగెద నామనస్సు ప్రకారము నీవు నడిపించవలెనని నాకదియ గురుదక్షిణయని గురువు నొడివెనంతట నాచిన్నది తిరుగా నింటికి వచ్చెను - తర్వాత దాని తండ్రి సమస్తదేశముల రాజులకును సమాచారమంపి వారి రూపములు వ్రాసియుండెడు పటములను దెప్పించి తనకొమార్తెయొద్దకి నంపె నాచిన్నది యాపటంబులన్నియుంజూచి యందులో నొక దేశపు రాజునుగోరియప్పటంబు తండ్రి చెంత కనిపి యీరాచకొమారునికి నన్నిచ్చి వివాహము సేయవలెనని సమాచార మంపెను - తర్వాత దానితండ్రి గొమార్తె గోరిన రాజునకు సమాచారమంపి యతని బిలిపించి వివాహప్రయత్నము సేసి రేపు ముహూర్తమని పట్టణమంత యుంజాటనం పెను - అప్పుడా రాజుకొమార్తె రేపు తనకుఁ బెండ్లిముహూర్తమని తనగురువునకు జా

బువ్రాసి తగినమనుష్యుని యొద్దనిచ్చియంపించెను - అది గురువుసూచు
కొని నీపెనిమిటిదగ్గిరికి నీవు పోవు దినంబున సకలాభరణ భూషితురాలవై
ముందుగా వచ్చి నాతోమాట్లాడిపొమ్మని సమాచారమువ్రాసియంపెను -
ఆచిన్నది పెండ్లియయినతరువాత రాత్రి దన పెనిమిటిపడకటింటికిరాఁగా
నేయీసమాచారమతనితోఁజెప్పెను - గురువు నకు మాట యిచ్చి తప్పితే
దోషమువచ్చునని యెంచి పెనిమిటి భార్యకు సెలవిచ్చెను - పిమ్మట నాచిన్న
ది సకలాభరణములు ధరించుకొని రాత్రి వేళ నొంటిగా నంతఃపురముబైలు
వెళ్లిగురువులయింటికిఁ బోవుచుండగా నడమదొంగలీ చెలియంజూచిదోఁచు
కొన యత్న పడిరి - అప్పుడమ్మగువ దొంగలంజూచి యన్నలారా నేనా
భరణములన్ని యుంబెట్టుకొని గురువుచెంగటికి నరుగునట్లుగాగురువు నకు
మాటయిచ్చి యున్నాను - కాఁబట్టినేనుగురువుచెంత కుంజనితిరుగానీదోవ
నేవచ్చి మీకు దోఁపిచ్చెదననిన నందుకువాండ్లుసమ్మతించి యామెనుదోఁ
చక విడిచి పెట్టిరి - అంతనామెగురు సమీపంబు నకుంజని యయ్యా మాట
ప్రకారము వచ్చితి నేమి యాజ్ఞాపించెదరనిసవినయముగాఁబలికెను - అ
ప్పుడతఁడీన వలాఁ జూచి యమ్మా నీమాట నిలకడఁ జూతామని నేరమ్మంటినీ
వుమాటతప్పనిదానవు నాకుమహాసంతోష మయినది నీపలికి బొంకని తన
ముం జూడం గోరితిసుం తే కాని వేరే కోరిక లేదు నీవు మీయింటికిం బోయి
సుఖముగానుండుము నేను దర్వాత నామెగురువు చేత శెలవు పుచ్చుకొని
మునుపుదన్ను దొంగలడ్డగించిన చోటికివచ్చి దొంగలం జూచి యన్నలారా.
యిదిగో నేనువచ్చినాను మీరు నాసొమ్ములన్ని యుం దీసుకొండని వాండ్ల
కెదురుగా నిలుచుండె నప్పుడు వాండ్లీచిన్న దానిం జూచి సాగిలపడి మ్రొ
క్కి-యమ్మా నీ వాడితప్పని దాన విటువంటి నీసొమ్ములు దీసుకొన మాకు బు
ద్ధిపుట్టలేదు నీసొమ్ములతోఁగూడానే నీవు మీ యింటికిఁ బొమ్మనిచెప్పిరి - త
ర్వాత న్నామెదన పెనిమిటి యొద్దకువచ్చి యీవృత్తాంతంబంతయు నతని

తోఁజెప్ప నతఁడుమిక్కిలియాశ్చర్య పడి భార్యా గుణంబునకు మెచ్చి మఱికొన్ని దినంబులకు నక్కోమలిం దనపట్టణంబునకుఁ బిలుచుకొని పోయెను - రాచకొమారుఁడు - రాచ కొమార్తె - దొంగలు - గురువు - వీరిలోగుణాధికు లెవరని సభలోఁ గూర్చుండి యుండెడు నానలుగురిని న్విక్రమార్కుఁడడుగఁగాఁ బెండ్లియాడిన దానిని సగము రాత్రి వేళఁ బరపురుషునియొద్దకుఁ బోయెదననిన సమ్మతించి యనిపినాఁడుగాన రాచకొమారుఁడే గుణాధికుఁడని పెద్దవాఁడు నొడివెను - చిన్నినాడు దాఁజెప్పిన మాటదప్పక గురువు చెంతకుం బోవలయునని పెనిమిటి చేత శెలవు దీసుకొని పోయెంగాన రాచకొమార్తె గుణాధికురాలని రెండవ వాఁడు పలికెను - తన్ను వెదకుచుం దన యొద్దకు వచ్చిన యువతిం జూచి యితర చింత లేక తిరుగాఁ బొమ్మనుటం జేసి గురువే గుణాధికుఁడని మూఁడవ వాఁడు సెప్పెను - తమ చేతఁజిక్కిన సొమ్ము దోఁచుకొనక విడిచి పెట్టిరి గనక దొంగలే గుణాధికులని నాలవ వాఁడు వక్కాణించెను - అప్పుడు విక్రమార్కుఁడు గడపటివాని మాటలు విని చేతఁజిక్కిన సొమ్మపహరించక విడిచి పెట్టడమే యెక్కువగాఁ జెప్పుచున్నాఁడు గావున నాసొమ్మువీడెత్తుకొన్నాఁడని నిశ్చయించుకొని యందఱి నిండ్లకుం బొమ్మని శెలవిచ్చి మఱి పదిదినములు తాళి యాకడపటివాని నొంటిగాఁబిలిపించి నీవు సొమ్మెత్తుకొన్న సమాచారమంతయుం బైటఁ బడ్డది దానికి సాక్షులును బహుమంది యున్నారటువంటి పని నీవేల చేసితివని యడుగఁగా వాఁడుభయపడి నేఁ జేసినది దప్పు పని నాతప్పు క్షమించి నన్ను మన్నించవలెనని ప్రార్థించి తానపహరించిన ద్రవ్యంబు సర్వంబును దెచ్చి రాజుముందరనునిచెను - అంతట రాజు మఱియొక నాఁడా నలుగురిం బిలిపించి మీసొమ్మపహరించిన వాని విచారించి తిరుగా సొమ్ము దెప్పించితిని మీరు నలుగురుం బంచుకొండని వారికి నాసొమ్మిచ్చెను గావున నట్టిబుద్ధికుశలత నీకుం గలదా యని ప్రతిమ పలుకఁగా నింతలో శుభలగ్నముమించె నని భోజరాజింటికిం జనియెను,

మఱునాడు తిరుగా భోజరాజు శుభముహూర్తము విచారించుకొని బంధుమిత్ర సమేతుండై సింహాసనము దగ్గిరికివచ్చి యెక్కఁబోవుచుండగా నేక త్రింశత్తమసోపానమునందుండెడు ప్రతిమ రాజు నీక్షించి విక్రమార్కునికి సాటియైన వారే యీసింహాసనమధిష్ఠింప నర్హులాయన గుణాతిశయంబులు వక్కాణించెద నాకర్ణింపుమని యిట్లనియె.

విక్రమార్కుఁడు భూసంచారము సేయునప్పు డొకసారి కాళికాదేవిను ద్దేశించి యాకలములు మెసవుచు ఘోరంబగు తపం బొనరించిన నద్దేవి ప్రసన్నయై యారాజు గోరినట్లు పరకాయప్రవేశవిద్య ననుగ్రహించెనటుపిమ్మటం గొన్ని దినంబులకు మార్గమునం నొక కంసాలవాఁడుపొట్టేలును బెంచియచ్చటికివచ్చి న పొట్టేళ్లతో దానింజగడమునకు విడుచుచుండును వాఁడునుం బరకాయప్రవేశ విద్య యెఱిగినవాఁడు రాజొక పొట్టేలును బెంచి యామార్గమునవచ్చుచుండగాఁగంసాలవాఁడుసూచి నీపొట్టేలును నాపొట్టేలుతో జగడంబునకు విడిచెద వాయని మందలించెను - అందుకు రాజొడంబడి యట్లు సేసె నప్పు డారెంటికిని ఘోరంబగు యుద్ధంబు ప్రవర్తిల్లె నంతఁగొంత సేపటికిఁదనపొట్టేలు మూర్ఛిల్లి నరాజుదనకళేబర మొకచోట మఱుగుగానుంచి దానికళేబరములోఁబ్రవేశించి జగడమాడసాగెను - ఈరహస్యము వాఁడు దెలుసుకొని రాజకళేబరము వెతికి కనుగొని యందుఁబ్రవేశించి తనదేహము నటికివేశి రాజ నగరమునకుఁ జని యంతఃపురముఁబ్రవేశించి యుండుసమయంబున రాజుభార్యలు వానింజూచి యాకారముఁజూచిన రాజుదియుగుణంబులన్ని యవియుఁగాదోచుచున్న యవియిది యేమో లెస్సగా విచారించవలయు నని మంత్రికి నెఱుకసేసిరి మంత్రియునితనింజూచి యిదియేమో మోసముగానున్నది - మంచిదికానీ నిదానముగా విచారింతమని రాజు భార్యలను జూచి యిప్పుడు మీరెద్ది యేనియు

నొకయభ్యంతరము సెప్పి యతనితో సంభాషణ విసర్జించి యుండుఁడిం
తలోనే నంతయు విచారించెదనని వారితోఁ జెప్పెను వారు మంత్రి మాట
లు విని వానింజూచి మేమొక వ్రతమారంభించినాము గావున నాఱు నెలల
మట్టుకు మాతో నీవు మాట్లాడఁగూడదు - ఆఱు నెలలకు వ్రతసమాప్తియగు
చున్నది తర్వాత మాతో మాట్లాడవచ్చునని చెప్పిరి వాఁడును నామాట
కు సమ్మతించియుండెను - అదియట్లుండగా నిక్కడం బోట్టేలి దేహములోఁ
బ్రవేశించిన రాజు గంసాలవాని పొట్టేలును జంపి తర్వాతయా దేహమువిడి
చి తన దేహము దాఁచిన చోటికి వచ్చి దేహము గానక నచ్చటఁ దుండెము
లై పడియున్న కంసాలవాని కళేబరముఁ జూచి యిది వాఁడు సేసిన మోస
ము గదాయని యెంచి తిరుగా మునుపటి చోటికి వచ్చెను - ఇంతలో దోవను
భొయ్యేడు వాండ్లు వచ్చిన వాటి నీడ్చుకొని పోయిరి - అంతట రాజు దాఁ బ్ర
వేశించుటకు దేహము లేక చింతాక్రాంతుఁడైయుండెడు సమయంబున నొ
కచచ్చిన పెంపుడు చిలుక నచట నొకఁడు దెచ్చి పారవేసిన నారాజా చిలు
క దేహములోఁ బ్రవేశించెను - అప్పుడు గొన్ని చిలుకలా మార్గమునఁ
బోవుచు నీచిలుకం జూచి మాతోఁ గూడ సంచారమునకు వచ్చెదవాయని య
డిగెను - మంచిదని యీ చిలుక వాటితోఁ గూడఁ బ్రయాణమైపోయె నవియ
న్నియు వనములలో సంచరించుచుండఁగా నొక బోయవాఁడు చెట్టుమీఁద
నురులొడ్డియింటికింబోయె నా చెట్టుమీఁదఁ బండ్ల కోసమివి యెక్కి యాయు
రులలో నంజిక్కుకొనియె నటుపిమ్మట నీరాజు చిలుక కడమ చిలుకలంజూచి
మనకు నపాయము రాకుండ నేనొకయుపాయముఁ జెప్పెద వినుండదియె
ట్లన్న మనమెందఱమో యిప్పుడు లెక్క బెట్టుకొని యీయురులొడ్డిన వాఁ
డువచ్చినపుడు మనము మెడలు వేలవేసుకొని చచ్చినట్టుపడి యుండమీచి
లుకలు చచ్చినవి యని వాఁడెంచుకొని యొక్కొక్కదాని నీయుర్లలోనుంచి

తీసిక్రిందవేయును మనలనంతరినిం క్రిందవెయ్యగానే లేచి పారిపోదమని చెప్పఁగా నట్లు సేయుట కన్నియు సమ్మతించి జాగ్రతగా నుండె నింతలో నాయురు లొడ్డిన బోయవచ్చి వీనింజూచి నేడు శానాచిక్కె నని సంతోషించి దగ్గిరికివచ్చి యొక్కొక చిలుకం దీసిచూచి చచ్చినట్టుగా నున్నదని క్రిందవేసె నన్నింటి నీరీతి నురులలో నుంచి తీసి క్రిందవేయుచువచ్చెం గటపట నీ రాజ చిలుకం దీయఁబోవునపుడు వాని చేతనున్న కొడవలి క్రిందఁబడియె నా కొడవలి దిగువఁబడడము చిలుక దిగువఁబడడముగా నెంచుకొని లెక్క సరిపోయెనని చిలుకలన్నియు లేచిపరుగెత్తె నది చూచి వానికి నిండా కోపము వచ్చి యీ చిలుకం బట్టుకొని మెడవిరువబోయె నపుడచ్చిలుక వానింజూచి యో యీ నీవు నన్నుఁ జంపవద్దు నన్నుఁ జంపితి వేని నీకేమి లాభము గద్దు నా మాంసము నీకొక ప్రూట యాహారమునకును జాలదు నన్ను నీ వెవరి దగ్గిరి కైన నముఁగొనిపోయి యమ్మితి వేని నీకు నూఱువరాలిత్తురని చెప్పెను - అంతట వాఁడు చిలుక పలుకు లాలకించి కానీ యిదిమన చేతులో నే చిక్కియున్న దెందుఁజనఁగలదిం కా నాలుగు గడియలు దాళి చంపుకొనుని యెంచి యొకపట్టణంబునకుం బోయి వారివారికి నన్నుఁజూపెను జూచిన వారెల్ల నిది యేమి వెలయని యడుగఁగా గిరి నూఱువరాలని బోయ సెప్పెనంత వెలయెక్కుడైన మాకువలదని యెవరును దీసుకొనరైరి తర్వాత నా పురమునందుఁ గాపురంబుండెడు వాఁడును మహాధనవంతుండును నగు నొక వైశ్య శిఖామణి యింటికిం దీసుకొని పోయి యీచిలుకంగొని యెదరాయని బోయ వాఁడడిగెన తఁడు బిడ్డలు లేనివాఁడు గావున నీ చిలుకం జూచి యేమి వెలయని యడిగెను నూఱువరాలని వాఁడు సెప్పెను - చిలుక యేమి నూఱువరాలేమి యని యాతండాలోచించుచుండఁగాఁ శుకరత్నంబయ్యా మీరు నూఱువరాలు గొప్పగా నెంచవద్దు నన్నుఁగొని మీ యొద్ద నుంచుకొంటిరేని నేను మీకు బహులాభము వచ్చునట్లు సేసెద సంశయించవద్దని కోమటిశెట్టి

తోఁజెప్పి ననతండిది యేమో యీవిధముగాఁజెప్పుచున్నది-కానీ చూతా
ము నూఱువరాలేకదా మనమిపుడివ్వ వలశినదని యెంచినూఱువరాలు వా
నికిచ్చి చిలుకందీసుకొని యొకపంజరములో నుంచి తనయంగటిలో నుంచు
కొని యెనాకీరంబును నావర్తకునికి సకలకార్యంబుల యందును సహాయ
ముగానుండును - చిలుకమీఁదవర్తకునికి నిండా దయపుట్టిమంచిమధురము
లైన ఫలములన్ని యుందెచ్చి యిచ్చును - మఱియు నాతండా చిలుక నయ
వలయు నన్న బేరంబవశ్యంబుగాఁజేయును వలదన్న నుడుగు నతనికి సొ
మ్మివ్వ వచ్చు నన్న నిచ్చుఁగూడగన్న నానునుజిలుకమాటకువ్యతిరిక్తము
గానొక్కటేనియుంబలుకఁడిటు లుండగా నాపట్టణమేలెడు రాజుగగ్గిర
ను బగ్మావతి యను నొకభోగముదియుండెను - అదిరాత్రిఁదన కలలో నెవ
రైననగుపడిరేని వారిచేతనూఱువరాలు దీసుకొనును - ఒకనాఁడొక పేద
బ్రాహ్మణుఁడు గానికలలోనగుపడెనంతట నాభోగముది యాబ్రాహ్మణు
ని గుఱ్ఱుసెప్పి యతఁడెక్కడనున్నాఁడోచూచి నూఱువరాలడిగితీసుకొని ర
మ్మని తన బానిసె వాండ్లనంపెనపుడు వాండ్లా బ్రాహ్మణుఁడువీధి వెంబడి
వచ్చుచుండఁగాఁజూచియోబ్రాహ్మణా నీవు మాదొరసాని కలలో నగుప
డితివట కలలోనగుపడ్డపురుషునిచేత నూఱువరాలు పుచ్చుకొందుముకాబ
ట్టినీవా వరాలనివ్వవలసినదియివ్వ వేని మాదొరసానితోమాట్లాడి పోవలసె
నదియని చెప్పిరి -ఆమాటలకుబ్రాహ్మణుఁడు మహాదీనుఁడై నేనొకటియు నె
ఱుఁగనిదియేమివచ్చెనని చింతించుచు భోఁగముదానినునుష్యులతోఁగూడ నా
చిలుకను పెంచినవర్తకుని యింటి దోవనుబోవుచుండఁగా నా చిలుక యతనిం
గని యోబ్రాహ్మణుఁడాయేలవిచారపడియెదవెక్కడికింబో యెదవి టురమ్మ
నిపిలిచెను - ఆసమాచారముచిలుకతోనతఁడుసెప్పెను-అది చిలుకవినియా
శ్చర్యపడి మంచిది నీవు భయపడవద్దు వరాలు నేనిచ్చెదఁగాని

నిక్కడికివచ్చి కొంచుపొమ్మని చెప్పుచునెను - ఈమాటలు దాని మనుష్యులతో బ్రాహ్మణుఁడు సెప్పెను వారుపద్మావతిని బిలుచుకొనివచ్చిరి - శుకంబుపద్మావతింగని నీపై కంబునీకిప్పించెదనిమిషంబు దాళుమనివీథిలోనొకస్తంభము నాటించినిష్క శతం బొకగుడ్డ కొంగునంగట్టించి యా మూటయాకంబపు చివరందగిలించి కంబపు మొదటనద్దము బెట్టించియనంతరంబోపద్మావతీయదిగో నిష్క శతంబును మీదఁగట్టించినానది దీసుకొమ్మనినంబోడుగాటిస్తంభపుచివరంగట్టియున్న మూటనాకు నందు నాయెవరినైనను దానిమీదనెక్కించిమ్మల్లె విడిపించియిమ్మనిపద్మావతిపలికెను - ఆమూట నేనువిడిపించి యివ్వవలశినది లేదిక్రిందనుండెడునద్దములోనగపడుచున్నదియాయద్దములోఁ జేయి వెట్టి తీసుకొమ్మనికీరరత్నంబు నొడివెను - పైననుండి దిగువముకురంబులోఁబ్రతిఫలించెడు మూట ముకురంబు లోఁ జేయ్యిడియెట్లు విడుచుకొనవచ్చునని వేశ్య యుత్తరంబిచ్చెను - తనయింటఁ దానుండి కలలోనగుపడ్డ వానిదగ్గరవరాలెట్లు పుచ్చుకోవచ్చు ననిశుక రాజం బెత్తిపొడిచెనంతటఁబద్మావతి యీమాటలు పలుకుటకుయుక్తి దోఁచక సిగ్గు చేఁదలవంచుకొనితనమందిరంబునకుం జనినాటిరాత్రి రాజునొద్దకుఁబోకనిలిచి యెందుకురాలేదని రాజడుగ నంపినఁదనకుశిరోభారంబు గనిపించెంగావున రాజాలనని బదులు సమాచార మంపెను- తర్వాత రాజుపంపిన వైద్యులుబహుమంది దాని యింటికివచ్చి కొన్ని కొన్ని చికిత్సలు చేసిరి దేనివల్ల నుంగుదర లేదనియది సెప్పెను - మఱు నాడు రాజు దాని యింటికివచ్చి యేమిమందు.చేసిన నుందల నొప్పి కుదరక పోయెనిఁక నేమిచేతు నెట్లూకుదురునని ఖిన్నుఁడై పద్మావతినడిగిన నదియిట్లనియె.

రాజా నాయింటికి వాడికగావచ్చు చుండెడువైద్యుని నేఁడుదయానఁబిలిపించి చేయి సూపిన నతండిది బలువైనజాడ్యము ముదిచిలుకను దెచ్చి వండిదానిలో నేనిచ్చి నమందు సమ్మిళితంబు చేసిపుచ్చుకొంటి వేని

నీజాడ్యంబు నివర్తించు నని చెప్పె నటుపిమ్మట నీపట్టణంబు లోనుండెడు చిలుకలలో ముదిచిలుక యెక్కడ నున్నదో వెదకి రమ్మని నావని వాండ్ర నంపితిని ఫలాని వర్తకుని యింట ముదిచిలుక యున్నదని వాండ్రు సమాచారము దెచ్చినారు కావున దానిం దెప్పించి యిచ్చిన నా నొప్పి కుదురునని పలికిన నెప్పగిదినైన నీకీజాడ్యంబు నివర్తించినఁ జాలు వర్తకుని చిలుక నిదిగో తెప్పించి యిచ్చెదనని పద్మావతి నూరడించి యావర్తకుని బిలిపించి మీయింటనుండెడు చిలుక నాకుఁ గావలసియున్నది దాని నాకిచ్చితివేని నీకు వేయి వరాలిచ్చెదనని పలికెను.

అయ్యా నేను బిడ్డలు లేని వాఁడం గావునఁ జిలుకను బిడ్డవలె పెంచుకొంటిని మీరు పదివేల వరాలిచ్చినను దాని మీకివ్వఁ జాలనని వర్తకుండు పలికిన తర్వాత నిరువది వేలు మొదలుకొని యెచ్చించి కడపట లక్ష వరాలకిచ్చెదవా యని రాజడిగిన నందుకును నొడంబడక నేనింటికిఁ బోయి యాలోచించుకొని రేపు చెప్పెదనని రాజుచేత శెలవు తీసుకొని యింటికి వచ్చి చిలుకకు నీవృత్తాంతం బంతయుం దేటపరచి నీ వెచ్చట నేనియుం దాగి యుండుము నిన్న నేనింటికి వచ్చునంతలోఁ జిలుక యెక్కడనో పోయె నగుపడ లేదని రేపు రాజుతోఁ బొంకెదనని పలికెను.

అప్పుడు శుకోత్తమం బతనిం జూచి రాజు నన్నడిగిన పని నాకుఁ దెలుసును అదేమన్నను నామీఁదం బద్మావతి పగబట్టి నన్నుఁ జంపవలెనని రాజుతోఁ జెప్పి నన్నుఁ దెప్పించుమన్నది - మంచిది రాజడిగినప్పుడు మీరివ్వకున్న మీమీద రాజునకు ద్వేషము పుట్టును రాజద్వేషము గారాదు కాబట్టి లక్ష వరాలు దీసుకొని రాజునకు నన్నిండని చెప్పి పద్మావతి దనమీఁదఁ బగబట్టుటకుఁ గారణంబును నతనికిం దెలియఁ జేసెను - ఈమాటలు వర్తకుఁడు విని బహుచింతాక్రాంతుఁడై నిన్ను బిడ్డవలె నే పెంచితిని నేను వేరే బిడ్డలు లేని వాఁడం గావున నిన్ను విడిచి నేనిలువ లేను లక్ష వరాలు గాదు రెం

దులత్తుల వరాలు వచ్చుంగాక నేనిన్ను విడిచిపెట్టనని యేకరీతిగాఁ జెప్పె
ను - అయ్యా నీవిట్లా యేల చెప్పుచున్నావు రాజు కావలెనన్న పనికి న
భ్యంతరముఁ జెప్పరాదు - ఒకవేళ నభ్యంతరముఁ జెప్పినట్టయితే రా
జు వినండెట్టులైనను నన్నుఁ దెప్పించుకొనును - అట్లా విరసముగా రా
జు నన్నుఁ దెప్పించుకొనుటకంటెను సరసముగా నీవే యిచ్చిన మంచిది నీ
కును లత్తు వరాలు దొరుకుచున్నవియని తెలియఁజెప్పి యతని నొడంబర
చి మఱునాడు రాజుదగ్గిరికి నంపెను - రాజతనిఁ జూడగానే చిలుక సంగ
తి యేమాయెనని పలకరించెను - అప్పుడు శెట్టి రాజు చేసెడు బలాత్కార
మువల్ల నుం జిలుక సమ్మతించుటవల్ల నులత్తు వరాలు దీసుకొని యింటికి వచ్చి
చిలుకను దీసుకొని పోయి రాజునకిచ్చెను - అంత నా చిలుకను రాజు పద్మా
వతి యింటికిం బంపించెను - పద్మావతియుఁ జిలుకం గని నాడు నన్నుం దయవ
మానపరచితివి గదా యిప్పుడు నిన్ను నేను భక్షించెదం జూడుమని యెత్తిపొ
డుపు మాటలాడి దాని రెక్కలు విరిచి తన బోనగత్తె చేతికి నిచ్చి దీని వండి నా
కు వడ్డించుమని యాజ్ఞాపించి మహా సంతోషముగా నుండెను - పిమ్మట నా
బోనగత్తెయు మహానసంబు చెంతకుం జని దానినందుంచి కత్తిపీట దీసుకొని రాఁ
బోగా నింతలో నది మెల్ల మెల్లగా నడిచి జలదారిలో దూఱెను - తర్వాత
బోనగత్తె కత్తిపీటఁ దీసుకొని వచ్చి యచ్చటఁ జిలుకం గానక భయపడి యీ
సంగతి పద్మావతికిఁ దెలిసెనా తన్నుఁ జంపించును గాబట్టి యీపెకుఁ దెలి
యనివ్వరాదని యెంచి మఱియొక పక్షిని దీసుకొని వచ్చి వండి పద్మావతికిఁ బెట్టె
ను - అది దాని భక్షించి నిండా సంతోషించెను - ఈ జలదారిలో దూఱిన చి
లుక పగటి వేళ నెవ్వరికిం దెలియకుండ నక్కడనే యుండి రాత్రి వేళ నంద
ఱుం బరున్న వెనక రెండు జాములమీఁద బైటవచ్చి యచ్చట దొఱికిన యా
హారము భక్షించి వేకువ జాము నఁదిరుగా జలదారిలోఁ బ్రవేశించు
ను - యీ ప్రకారము కొన్ని దినములుండగా నానాటికి రెక్కలు పెరిగి చ

క్కగా నెగిరి పోవు నంత సామర్థ్యము లేఁగానే యాలావు విడిచి పెట్టి యీశ్వరుని గుడికింజని మూలస్వామికి వెనకతట్టుగాఁ గూర్చుండి మఱు నాఁడర్చకుఁడు దేవునింబూజించు సమయంబున నతనిం జూచి యోయర్చకుఁడా నేనొక కార్యము నిమిత్త మిక్కడికివచ్చి యున్నానునీవెవ్వరికిం దెలియకుండ నన్ను పదిదినములు కాపాడితి వేని నీకుం జాలనాదాయము గలుగం జేసెద ననిపలికిదిన దినంబును నాతండిచ్చు దేవతాని వేదితంబగు నన్నంబు భుజియించుచుండెను - అంతట నొకనాఁడు పద్మావతిస్వామి దర్శనార్థము శివాలయంబునకు వచ్చి స్వామినిఁ బ్రార్థించుచుండఁగా నోపద్మావతీ నీభక్తికి మెచ్చితిని నీకేమి కావలయు నడుగు మిచ్చెదనని స్వామి వెనకతట్టున్న చిలుక పలికెను - అదియాపలుకులు విని స్వామి సనకుఁ బ్రత్యక్షమై కావలయునది యడుగు మిచ్చెదననెఁగదా యని మిక్కిలి యుప్పొంగి సాగిలపడి స్వామీ మీకృపవల్ల నేను సమస్త భోగములను భవించి నదాన నేమిటం గొఱంత లేదు బొందితో స్వర్గానకుఁ బోవలయునను కోరికె యున్నది దాసురాలి యందుఁ గటాక్షము నిచి యనుగ్రహింప వలయు నని ప్రార్థించెను - మంచిది రేపురమ్మంతయుం జెప్పెదనని చిలుక నొడివెనంతటఁ బద్మావతి యింటికింబోయి మఱునాఁడు తిరుగా వచ్చి స్వామీ వచ్చినా నేమి సెలవిచ్చెదరన నోపద్మావతీ నీ మనోనిశ్చయమునకు మెచ్చితిని నీకోర్కె నెఱవేర్చెద నీవింక ధన కాంక్ష విడిచి నీయాస్తిలో సగము నన్నెల్లప్పుడు నతిభక్తితోఁ బూజింపుచుండెడు నీయర్చకునకిప్పుడు ముందుగా నిచ్చి కడమ సగంబును నానాదేశంబుల నుండివచ్చు వారలకును నిన్నాశ్రయించియుండు వారలకును యథేచ్ఛగా దృఢచిత్తవై దానంబు సేయవలయునని చిలుక చెప్పెను - అందుకు బద్మావతి యుప్పొంగి తన గృహంబునకు వచ్చి తత్క్షణంబ యాయర్చకునిం బిలువనంపి తన యాస్తిలో సగంబతనికి దానంబు సేసి యతని గృహంబునకు బంపించి యనంతరంబ రాజు నింటికేఁగి యీవృత్తాంతం బంతయుఁ దెలిపిన నతండాశ్చర్యం

బు నొంది రేపు నేను నీతోడన శివాలయంబునకు వచ్చెదనని పలికి మఱి నా
డు దానితోఁగూడా శివాలయంబునకుఁ బోయెను - అప్పుడు పద్మావతీదేవు
నికి మ్రొక్కి స్వామి తమరు సెలవిచ్చిన ప్రకారంబుగా నచట కునికి ని
చ్చి తిక్కడను సగంబును నానాదేశంబుల నుండివచ్చు వారలకును నన్నా
శ్రయించిన వారలకును నిచ్చెదను తీయు నాకేమి యాజ్ఞాపించెదరనియ
డిగియలబ్ధప్రతివచనయై రాజుంజూచి నేనుమిమ్ముంబిలుచుకొని వచ్చితిన
నిస్వామికిఁ గోపమువచ్చెఁగా బోలుమీరు పైటికి పొండని రాజును వెళ్లనం
పితా నొంటిగానిలిచి యీశ్వరునిం బ్రార్థించెను - అంతటఁజిలుకశివు
నిమఱుగున నుండి యోపద్మావతీ నేను నీభక్తికి మెచ్చి నీకుమాత్రము ప్రత్య
క్షమై మాట్లాడితిఁగాని యన్యులు వినంగా మాట్లాడుదునా నీవికమీద
నీతోఁగూడా నెవరినిం బిలుచుకొని రావలదు నీవు రాజుతోఁ జెప్పి సమస్త దే
శముల యందుండెడు రాజులను నీవేడుకచూచుటకై సపరివారులై రమ్మ
ని జాబులంపునట్లు సేయుమనెను - తర్వాత పద్మావతియీసమాచారము
రాజుతోఁ జెప్పి వారివారికి జాబులు వ్రాయించి పంపించెను - ఈజాబు
లు చేరఁగానే సమస్తదేశాలవారును మిక్కిలియాశ్చర్యపడి బహుమంది
యాపట్టణమునకు వచ్చిరి - పద్మావతియును నీశ్వరసన్నిధానంబున
కుఁబోయి స్వామి సకలదేశముల వారునువచ్చినారు కడను నాసగమా
స్తియుదానంబు సేసితినని విన్నవించెను - ఓభక్తురాలా రేపటిదినముద
యమైనపదిగడియలవేళఁ బద్మావతిబొందితోస్వర్గమునకుఁ బోచున్నదని
పట్టణమంతయుఁ జాటనంపుము-ఇదియునుం గాక రేపు ప్రొద్దున నీవుసక
లపాప విమోచనమగునట్లుగా క్షౌరము చేయించుకొని స్నానము చేశి
బొట్టు పెట్టుకొని శిఖర వాహనారూఢురాలవై పట్టణము నాలుగు వీథులు
నూరేఁగి పది గడియలకు లోగా నాయొద్దికి రమ్ము గుడి ముంగల బొమ్మల
మెత్తున నొకయుట్టి గట్టించుము పొమ్మనినన మ్మగువయు పారా సంద పారా

వారంబు నందేలి యాడుచు గేహంబున కేఁగుదెంచి రాజును రావించి యీసంగతి దెలిపిపట్టణంబునఁ జాటంబంచి మఱునాడు వేకువను లేచి కాలోచితకృత్యంబులుదీర్చుకొని చిలుకచెప్పినచొప్పున నందల గొఱిగించుకొనిగాడిదెపై నెక్కి నాలుగువీథులునూరేఁగిగుడిముందఱ వచ్చి నిలిచెను - అప్పుడుసకలమైనవారికిని సమయంబు దెలియుటకై పెద్దనగారా మోగించిరి - ఆ భేరీధ్వనివినియెల్లవారునుందమతమపనులువిడిచిపద్మావతిబొందితోస్వర్గానికిఁ బోవ్వేడు వేడుక చూడవలెనని యతిత్వరగావచ్చి గుడిచుట్టు నునిసుకవేసితే రాలకుండ నిలిచిరా సమయంబునఁ బద్మావతి గుడిలోపలికిఁ బోయి స్వామివారిని సేవించుకొని స్వామితమ రాజ్ఞాపించిన ప్రకారముగాసిద్ధమై వచ్చి నాను గుడిముందఱఱొమ్ములమొత్తు ననుట్టిగట్టించినాను నన్నిఁకంగటాక్షించవలయునని చెప్పఁగాఁ జిలుకవిని మంచిది నీవుపోయియుట్టిదగ్గిరనిలుచుండి యుట్టిపట్టుకొనియెక్కుమనెను - పద్మావతియుట్టిదగ్గిరికిఁ బోయియెక్కలేక తిఱుగా గుడిలోపలికి వచ్చి స్వామీ యుట్టిఱొమ్ములమొత్తు ననున్నదియెక్కఁగూడలేదనెను - అయితే నేనే వచ్చి యెక్కించెదనచ్చటికిఁబోయియుండుమని చిలుకపలికెను - పద్మావతి మఱల నుట్టిదాపునవచ్చి నిలుచుండెను - పిమ్మటనాచిలుకబుఱ్ఱున లేఁచి గుడిపైటికివచ్చి స్తంభము మీఁదఁ గూర్చుండి - ఓపద్మావతీ - ఉట్టికినెక్కలేనిదానవు స్వర్గానికెట్లా యెక్కఁగలవు - ఛీ - బుద్ధి నేరవుపొమ్మనెను - ఆచిలుకనుజూచి చిలుకచెప్పినమాటలు వినిపద్మావతిదిగులుపడి చూచుచుండెను - అప్పుడుదాన్ని జూచి - ఓబుద్ధిహీనురాలా నాడు నేను తీర్చిన వ్యవహారమునకు నామీఁదఁ బగబట్టి నన్నుఁ దినవలెనని యత్నంబు చేసితివిదైవవశంబున నేఁదప్పించుకొని దానికిఁబ్రతికారము నీకుందల గొఱిగించిగాడిదెపై నెక్కించియూరేఁగించునట్లు చేసినాను - ఇంకమీఁదనైనను బుద్ధి గలిగిబ్రతుకుమని చిలుకపలికెను - అంతటనచ్చటివారందఱునాశ్చ

ర్య ము నొంది యోహో హో హో యీచిలుక యెంత యుపాయముగలది యి టు వంటి నేర్పుగల చిలుక లెక్కడనైనంగలవా యని చిలుకబుద్ధికి మెచ్చుకొని రి - పద్మావతిసిగ్గుపడితల వంచుకొని మహాఖిన్నురాలై యింటికిం బోయెను - చిలుకయుం దనవృత్తాంతంబెల్ల వారికిం దెలియంజేసి యచ్చటనుండికదలి యతిశీఘ్రముగాం దనపట్టణమునకుం బోయితనమంత్రులంజూచియీసమాచారము యావత్తునుం జెప్పంగా వారును సంతోషించి యంతఃపురంబునకుం బోయిరాజుభార్యలకీవార్తలు దెలియంజేసి రాజు నిజదేహములోం బ్రవేశించుటను గురించి యొకయుపాయముం జెప్పితమయానికిపట్లకుంబోయిరి-తర్వాతనారాజస్త్రీలుకపటముగారాజుననివచ్చిన వానితో విహితముగా మాట్లాడుచుండి వారిదగ్గిరనుండే చిలుకను జంపి చిలుకచచ్చి పోయెనని చింతాక్రాంతులై యుండిరి - అపుడతండు వచ్చి యెందుకు విచారపడి యెదరని యడిగెను - మాచిలుకచచ్చి పోయెనుగాం బట్టి విచార పడుచున్నాము చిలుకచచ్చి పోయిన విచారమట్లుండగా నిన్నటిదినమీచిలుక యొద్ద రెండుంగరములు వెలలేనివి దాచి పెట్టు మనియిచ్చి నామయ్యుంగరములు దాచినచోటు దెలియక పోయెనని నిండా విచారముగానున్నదియీచిలుక నెవ్వరైననునిమిషమాత్రము బ్రతికించి రేని వారేమియడిగిన నదియిత్తుమని చెప్పిరి - అప్పుడతండు నేబ్రతికించెద నేం జెప్పినట్టుగా నేడు మొదలుకొనివిని యెదరాయని యడిగెను - నీవు చెప్పినట్టే విని యెదమని వారు సెప్పిరి-తర్వాతనతండుదనదేహమొక యింటిలోనుంచి తానుశుకకళేబరములోం జొచ్చి శుకంబును బ్రతికించెను - వారా సమాచారముమంత్రులకుం దెలియ జేసిరి-మంత్రులురాజునుబిలుచుకొని కంసాలవాండు కళేబరముదాచిన యింటికిం బోయి యతనినిజదేహములోం బ్రవేశించు మనిరి-రాజాప్రకారముగాం జేసెను-పిమ్మటరాజునుమంత్రులును నంతఃపురంబునకుం బోయికంసాలవాండు బ్రతికించిన

చిలుకను జంపిరి - రాజు భార్యలు రాజును జూచి సంతోషించి మా భాగ్యవశమున మరల మిమ్ము గన్నులం జూడఁ గలిగెను - మీ కెంత యాపద వచ్చెను కంసాలవాఁడెంత మోసము చేసెను మీకు దైవము మిక్కిలి సహాయముగానున్నందున వచ్చిన తొందరలన్నియుం బరసి పోయెనని నవ్వు ముఖారవిందములతో రాజు చెయి పట్టుకొని లోనికిఁ బిలుచుకొని పోయి యొక రత్నమయంబగు సింహాసనంబు మీఁదఁ గూర్చుండఁబెట్టి తాము సుందరపీఠంబులపయిం గూర్చుండి యుండిరి - అప్పుడు వారి చెలికత్తెలలో నొకతె పయిడి చెంబుతో రాజునకుఁ గాళ్లు గడుగుటకై నీళ్లు దెచ్చి యిచ్చెను - ఒకతె కాళ్లు గడిగెను - మఱియొకతె కాళ్లు తుడిచెను - ఈప్రకారముగా ననేకుల నేకములయిన యుపచారములు జేసిరి - రాజును వారి యుపచారముల చేత సంతుష్టుఁడై వారల నాదరించి చక్కఁగా రాజ్యము చేయుచుండెను - కాబట్టి యిటువంటి యుక్త్యతిశయము నీకుఁ గలదా యని ప్రతిమ పలకఁగా లగ్నము మించెనని రాజింటికిఁ బోయెను.

ముప్పై రెండో సారి భోజరాజు శుభలగ్నము విచారించుకొని మంత్రి పురోహిత మిత్ర హిత బంధు పరివార పరివృతుండై కొలువు కూటంబున కేగుదెంచి యథోచితంబుగా సింహాసనమును పూజించి ధూప దీపాదులర్పించి ధ్యానించుచుండగా ముప్పది రెండవ సోపానము నందుండెడు ప్రతిమ యిట్లనియె.

వినుమో భోజరాజా నీవైతే యీ దేవనిర్మితమైన సింహాసనము నెక్కుటకు ప్రయత్నము సేయుచున్నావు - యిది పూర్వము దేవేంద్ర దత్తమైనది రెండు వేల సంవత్సరములు విక్రమార్కుఁడు దీని మీఁదఁ గూర్చుండి దొరతన మొనర్చినాఁడు - అతని సాహసాది యావద్గుణములు నీవు వినేయున్నావు గదా - అతనివంటి యుక్తి చాతుర్యములు గలవాఁడే దీని నెక్కనర్హుఁడు గాని మరి యెవరున్ను యెక్కఁగూడదు - అతని బుద్ధికుశలత తెలుపనఁగోరి తివా యొక కథ జెప్పుచున్నాను వినుమని యిట్లనియె.